ర్ణలతా గ్రంథమాల—2

# 'దిగంబరి,'

(తత్వనాటికలు)

మల్లాది అవధాని.

ప్రకాశకులు:

యలమర్తి రామమోహనరావు,

స్వర్ణలతా గ్రంథమాల,

కాకినాడ.

కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ.

వెల

నాల్గణాలు.

# నివేదన.

హాస్యగ్రంథాలనే ప్రకటించాలని స్వర్ణలత సంకల్పించింది. హాస్యంద్వారా ప్రబోధం సులభమని రుజువుచేసింది కూడా. 'యువ్వనం' ప్రకటించింది మొదటిపుస్తకంగా. దేశం అవధానిగారి ఇతరగ్రంథాలకు మోస్తరుగానే యవ్వనానికి అఖండస్వాగత మిచ్చింది. అవధానిగారు సవ్యసాచి. ఆయన గంభీరనాటికలను ప్రకటించమని దేశం కోరింది. దేశం ఆజ్ఞను స్వర్ణలత పాటిస్తూ "దిగంబరి"ని ప్రకటించింది. "దిగంబరి" గ్రంథం హక్కులన్నీ అవధానిగారివి. నాటకప్రదర్శన చెయ్యదలిస్తే ఆయన లిఖితానుమతి పొందవలసి ఉంటుంది. "దిగంబరి"ని పుస్తకరూపంగా ప్రకటించి దేశానికి అర్పించడానికి మాకు అనుజ్ఞ ఇచ్చినందుకు అవధానిగారికి మా ధన్యవాదాలు అర్పిస్తున్నాము.

వృష-, వైశాఖము

1941.

యలమర్తి రామమోహనరావు,
ప్రకాశకుడు:
స్వర్ణలతాగ్రంథమాల.

# మాలిని

[రాత్రి ఏడున్నర. విశాలమైనగది. తూరుపు పడమర లను రెండుద్వారాలు. ఒకదానికొకటి ఎదురుగా పలుచని పట్టుతెరలతో మూసుకొని ఉన్నవి. దక్షిణమున రెండు పెద్దకిటికీలు తెరచి ఉన్నవి. గదినడుమ మూడుసోఫాలు వరుసగాను దంతపు టేబిలుముందు ఒక కుషను కుర్చీలు, నిలువుటద్దాలలో బింబిస్తున్నవి. గోడలను రెండు చిత్రములు మాత్రము గలవు. ఒకదానిలో ఒక బిచ్చగాడు కొండకాలువలోనికి వంగి నీరు త్రాగుతున్నాడు. రెండోదానిలో ఒకపడుచు మధుపానము చేస్తున్నది.

సీలింగునుంచి రంగురంగులగాజుబుడ్లు వేలాడుతూ ఉన్నవి. వాటిలో దీపాలు వెలుగుతున్నవి. టేబిలుమీదను నాలుగుకూజాలలో గులాబీగుత్తులు చన్నీళ్ళలో తేలుతున్నవి. పక్కను బంగారు పాత్రలో పానీయము... పానీయములో ఒక కుసుమము.

మాలిని కిటికీముందు నిలుచుని పెంపుడుపక్షులతో కిలకిలమని నవ్వుతున్నది. పావురాలు చిలుకలు కిటికీ అంచుమీద నిలిచి 'తుప్పుతుప్పు'న ఆమెభుజాలమీదకు ఎగిరి చిన్నిరెక్కలతో ఆమెజడపై రెపరెప మనిపిస్తున్నవి. కిటికీ ముంజూరుమీ-

దనుంచి మాలతీ 'తీగెలు' తెల్లని పువ్వులతోను మెరుగుటాకులతోను ముంగురులవలె వేలాడుతూ ఉన్నవి. ఎదురుగా దూరాన నీలిపర్వతమువిూదనుంచి చంద్రబింబము వస్తున్నది. రాజవీధిలో గుఱ్ఱపుబళ్లు టకటక శబ్దము చేస్తూ పోతూన్నవి.

మాలినివయసు ఇరవై రెండు. మబ్బులో మెరిసే మెరుపువలె చురుకయిన చక్కని యౌవని. మృదువయిన ఏనుగుదంతమువంటి తనువు నీలిపూవులవంటి కనులూ, గులాబీలు దాక్కున్నబుగ్గలూ, ముత్యము మెరుగూ, కరవీర ఎరుపూ, మధువు తొణుకూ,గల రేకలుతిరిగిన నవ్వు పెదవులూ, నాగుబాము వంటి నల్లని మెత్తని జడా, తామరమొగ్గల పాదములు.........

ఆమె, ఆ సన్నని నీలిపట్టుచీరలో, ఉషస్సున గులాబీ రేకులోని మంచుచినుకువలె ఉన్నది. ఆమెనవ్వుతున్నప్పుడు వెండిమువ్వల మ్రోతవలె వినబడుతున్నది. ఆమెజడలో ఒదులుగా తురిమిన పువ్వులలోనుంచి ఒక సన్నజాజి జారి నేలను తివాసీపై బడినది.

వెన్నెల కిటికీలలోనుంచి గదులలో పడుతున్నది. తివాసీ మీద వెన్నెలలో మాలతీతీగెల, పావురాల, పక్షులనీడలు కోలగా పడ్డవి. మాలిని అపు డపుడు రాజవీధివేపు ఎవరికోసమో చూస్తూ ఉన్నది.

తూరుపుద్వారము తెర తొలగించి గదిలో ప్రవేశించినాడు ఆనందభిక్షువు. తలబోడిగా వున్నది. కాషాయవస్త్రములు

కట్టుకొన్నాడు. కనులలో దయగలదు. వయసు ఏభై దాటినది. అతడు మాలినివేపు చూస్తూ గోడకు చారబడి పెదవులను నాలుకతో తడి చేసుకొంటున్నాడు.

జీవనభిక్షువుకూడా వచ్చినాడు. తల బోడిగా ఉన్నది. కాషాయవస్త్రములు కట్టుకొన్నాడు. వయసు యిరవై రెండు. మెల్లగావచ్చి ఆనందునిదగ్గర అడకువగా నిలుచున్నాడు.

మాలినికి వీళ్ళరాక తెలీదు. ఇంకా రాజవీధివేపే చూస్తూ ఉన్నది.]

ఆనందభిక్షువు—(తలవంచి అతిమెల్లగా) తథాగత !

జీవనభిక్షువు—(తలవంచి అతిమెల్లగా) తథాగత !

మాలిని—(తుళ్ళిపడి యిటుతిరిగి భిక్షువులనుచూసి ఆశ్చర్యముతోను ఒకవిధమైన భయముతోను వెనుకకు రెండడుగులువేసి గోడకు చారబడిపోయినది. పక్షులు కొన్ని బయటను ఆకాశములోనికి ఎగురుకొంటున్నవి. కొన్ని యింకా కిటికీలో రెక్కలచప్పుడు చేస్తూఉన్నవి) మీ...రె...వ...రు ?

ఆనందభిక్షువు—భయపడకు తల్లీ ! మేము బౌద్ధభిక్షువులంగాని యింకెవరమూ గాము !

మాలిని—ఎందుకు వచ్చారు ?......ఏంపని మీకు ?

ఆనందభిక్షువు—ఎందుకా ? (తడబడుతూ) ఎందుకా ?

మాలిని—(చిరునవ్వు నవ్వుతూ హాయిగావచ్చి) ఈసోఫాలో కూర్చొండి !

(ఆనందభిక్షువు జంకుతో సోఫాలో కూర్చొన్నాడు. జీవన తలవంచుకొని నించున్నాడు. మాలిని నిలువుటద్దంముందు నిలుచుని అద్దంలో ప్రతిబింబిస్తూ ఉన్న ఆనందునివేపు చురుకుగా చూస్తూ తన జడలోని పువ్వులను సర్దుకొంటున్నది.)

ఆనందభిక్షువు—(వెనుదిరిగివున్న ఆమెజడనూ జడలోని పువ్వులనూ చూస్తూ జీవనునితో) జీవనా! ఎలా ఆరంభించను?

జీవనభిక్షువు—(తలవంచుకొని) నేను ఏంచెప్పగలను?

ఆనందభిక్షువు—ఆడవాళ్ళతో మాట్లాడడం అనుభవం లేనందుచాత ఏదో బితుకుగావుంది. నువ్వు చిన్నవాడవుగనుక, నువ్వే సంభాషణ మొదలుచేస్తే బావుంటుందేమో?

జీవనభిక్షువు—(సిగ్గుపడుతూ) అలా అనకండి! నేనింకా వుపాసకుణ్ణి. మీరు ధమ్మపథంలో చాలాకాలంనుంచి ప్రయాణంచేస్తూ నిబ్బాణానికి చేరువగావున్నారు. తథాగతుడు మా వంటివాళ్ళను స్త్రీలవేపు కనులెత్తి చూడవద్దన్నాడు. స్త్రీల చూపులలోనూ, మాటలలోనూ, మనస్సు పక్షిగూడుకట్టుకో వాలనుకుంటుందికాని అక్కడనే మారుడనే బోయవాడు తనను చంపడానికి సిద్ధంగా కాచుకుని కూచున్నాడని తెలుసుకోదు. యువతి చూపులు నొంకీతీగెలవంటివి; మెరుపుతీగెలవంటివి; ఎదురుగా నిలుస్తే ఆ తీగెలు హృదయంలోకి గుచ్చుకుని హృదయంచుట్టూ అల్లుకొని పొదగా అయిపోతాయి. ఆ పొదలో

మారుడు దాక్కుంటాడు. మారుడు నరకానికీ, దుఃఖానికీ తీసుకుపోయేందుకనే అంత దొంగతనంగా వస్తాడు అంటూ మారజేతసుగతుడు నావంటివాళ్ళనుగురించి చెప్పినసంగతి మీకు తెలుసును.

ఆనందభిక్షువు—ఇంకా కొంచెం మెల్లగా మాట్లాడు. వింటుందేమో !

(మాలిని యిటుతిరిగివచ్చి చప్పున సోఫాలో కూర్చొని తన జడను ముందుకు వక్షంమీదుగా వేసుకొన్నది. ఒకపావురా కిటికీలోనుంచి ఎగిరివచ్చి మాలిని తొడపైవాలి ముక్కుతో తాకుతున్నది. గిలిగింతలు కలగడంవల్ల మాలిని నవ్వుతున్నది. ఆమెవక్షంతోబాటు జడకూడా కొలనులోని అలవలె ఎగిరిపడుతున్నది.)

ఆనందభిక్షువు—(మెల్లగా) జీవనా !

జీవనభిక్షువు—వెళ్ళిపోదునా ? (తలను వంచుకొనే) ఆమెనవ్వు వెండిమువ్వల గలగలలాగున నా హృదయాన్ని కదిపివేస్తూంది. అది మారుని వింటి నారిమ్రోతలాగుంది. ఆనందభిక్షూ !

ఆనందభిక్షువు—జీవనా ! వెళ్ళిపోవద్దుసుమా...బౌద్ధభిక్షువుల సమీపంలోనికి మారుడు రాలేదు.........సంభాషణ ఎలా ప్రారంభించను ? మాలినీ !

మాలిని—(చాతకపక్షి ఎగిరినట్టుచూసినది)

ఆనందభిక్షువు—ఆజడ ........జడలోని తెల్లని పువ్వు లూ.........చీకటిరాత్రి ఆకాశంలో చుక్కల్లా వున్నాయి. తమాలతరువుమీదను మిణుగురులదండు వాలితే ఎంత యింపుగావుంటుందో అలావుంది. ఆ పూలచెండు ఆ నీలి మొహామలు వాలుజడలో......నీ చెంపలు చంపకపూల పరిమళంతో—

మాలిని—(నవ్వుతూ) నా చెంపలు మీరు వాసన చూశారా? ........మీ పేరేమిటో అడగలేదు.

ఆనందభిక్షువు—నేను ఆనందభిక్షువును, ఇతను జీవన భిక్షువు. తన పధ్నాలుగోఏటనే సన్యశించి పవిత్రభిక్షుకజీవితం గడుపుతున్నాడు.

(మాలిని పై మాటలను విన్పించుకోలేదు. లేచి టేబిలు మీదను కూజాలో ఉన్న పువ్వులను తీసి ఆనందునకిచ్చి జీవ నునిదగ్గరకువచ్చి నవ్వుతూ)

మాలిని—జీవనభిక్షూ! ఈ పువ్వులు ఎండమావులు కావు. కొంచెం వాసనచూడండి.

జీవనభిక్షువు—(పువ్వులుతీసుకొని మెల్లగా) తథాగత!

మాలిని—వానధారలవంటి ఆ చూపులు కొంచెం పైకెత్తకూడదుకావోలును!

జీవనభిక్షువు—(కన్నులు మూసుకొన్నాడు)

ఆనందభిక్షువు—మాలినీ! అతన్ని మాటాడించకు. కలతపడతాడు. అసలు విహారం విడిచి రానసే పట్టుపడితే నేను బలవంతపరచి నాకు సహాయంకోసమని తీసుకువచ్చాను.

మాలిని—(కిటికీదగ్గరకు వెళ్ళి వెన్నెలలో నుంచుని నవ్వుతూ) సాయమా? సాయంకూడా వుండాలీ?

ఆనందభిక్షువు—వెన్నెలలో ఎంత అందంగా వున్నావు మాలినీ! కొలనులో తెల్లకలువలాగ, సాయంకాలపు వెలుగులో వికసించిన గులాబిపువ్వులాగ మోహనంగావున్నావు! ఆ కనురెప్పలు తెరుస్తున్నపుడు వుదయం విడే మల్లెమొగ్గలు తలపులోనికి వస్తున్నాయి.

మాలి—(పక్షులను తన బుజాలమీద నిలబెడుతూ) అప్పుడే రాత్రిపడింది. ఆనందభిక్షూ! ఈపావురాలెలా వున్నాయి?

ఆనందభిక్షువు—నీకన్నులు పావురాల్లాగ నాబుజాల మీదకు వాల్తున్నాయి.

మాలిని—(నాజూకుగా నడుస్తూ పడమటిద్వారం నుంచి లోపలికి వెళ్ళిపోయింది.)

జీవనభిక్షువు—అబ్బ! (నిట్టూర్చినాడు.)

ఆనందభిక్షువు—(ఆలోచిస్తూ) జీవనా! మాలిని సొగసుగా నడుస్తూ లోపలికి వెళ్ళిపోతున్నపుడు ఆపాదాలు, ఆపా

దాల బంగారుగజ్జలూ చూశావు? ఆగజ్జలు ఘల్లుఘల్లుమంటూ వుంటూవుంటే మన విహారం వెనుకవున్న లోయలోని జలపాతం బండరాళ్ళమీద పడుతున్నపుడయ్యే మధురధ్వనీ కోయిలలు కూసే మత్తనాదమూ స్ఫురిస్తున్నాయి. ఆచూపులు...ఆ పెద వులు (తెలివితెచ్చుకొని) ఏమిటి మాటాడుతున్నాను ! ఛా ! కాగానా ? ఈ పువ్వుల్లో ఏదో మత్తుమందువుంది (పూలను గోళ్లతో చిదిమివేస్తున్నాడు.)

జీవనభిక్షువు—వద్దు ! వద్దు! చిదిమివేయకండి! చక్కని చిన్నిపువ్వులు.

ఆనందభిక్షువు—(లేచి నిలుచుని వెటకారముగా నవ్వు తూ) చక్కని చిన్నిపువ్వులు ! చక్కదనమన్నది ఒక లోతయిన అఖాతము...అది మారునిగుండె. ఆగుండెలో సూదంటు బండ లున్నాయి. ఒకసారి చూశామా మనల్ని అవి ఆకర్షించివేస్తా యి. అఖాతంలో పడిపోతాము !

జీవనభిక్షువు—పోనీ ఆనందమిచ్చే ఆకారాన్ని చక్క దనమనకండి ప్రకృతిలో ఆనందమిచ్చే వస్తువులెన్నోవున్నాయి. అందులో పువ్వుఒకటి !

ఆనందభిక్షువు—ఆ ఆనందమిచ్చే ఆకారమే సౌందర్యం. సౌందర్యానికి శాశ్వతత్వంలేదు ? ఇపుడు నవనవలాడుతున్న రేకులతోనూ, చల్లని మత్తుగాలిపే వాసనతోనూ, కనులకు

యిపుగాలిపే ఆకృతితోను, మెరుస్తున్న పువ్వే రేపటికి రేకు లు రాలిపోయి, వాసన చచ్చిపోయి, శవమయి పోతుంది. శా శ్వతమయినదేముంది లోకమూ-నిర్వాణమూ మినహాయిస్తే?

జీవనభిక్షువు—రేపు నశించిపోతుందని నేను దాన్ని నశింపుచెయ్యడమూ! మార్పు అన్నదిసహజం. కాలమన్నదా నికి మార్పు పర్యాయపదమేమో!...

ఆనందభిక్షువు—సాధ్యమయినంత మటుకు సౌందర్యా న్ని నశింపు చేయకపోయినా దానికి దూరంగా వుండడం మం చిది...జీవనా! జీవనా! (జీవనుని దగ్గరకువచ్చి మైమరచి పోయి మెల్లగా) నన్నిపుడు తథాగతుడు రక్షించాడు! నేను సౌందర్యాఖాతంలో పడిపోయే క్షణాన ఆకాశంమీదనుంచి ఎగురుకుంటూవచ్చి నన్ను గట్టిగా పట్టుకున్నాడు. చూడు! ఆమె జడ.........ఎంత సుందరంగావుంది......సౌందర్య మంటే సౌందర్యాఖాతమంటే అదే.........నదిలో తిరిగే సుడిగుండంవంటి ఆ జడపాయలో పడిపోదునుగదా! ఆజడ ఆమె నవ్వినపుడు యిటు అటు కదులుతూవుంటే మారుడు తన నల్లని చేయెత్తి నన్ను పిలుస్తున్నాడా అనిపించింది.

జీవనభిక్షువు—(తలవంచుకొని నెమ్మదిగా పెదవుల నడుమ 'తథాగతా' అని స్మరించు కొంటున్నాడు.)

(మాలిని రెండు మధుపాత్రలతో వచ్చినది. ఇరువురు భిక్షువులూ తలవంచుకొని ధ్యానంలో ఉన్నారు. ఆనందుడు తల యెత్తినాడు అతని కనులు తడిగావున్నవి.)

మాలిని—(సన్నగా) ఆనందభిక్షూ !

ఆనందభిక్షువు—(తలయెత్తి) మాలినీ !

మాలిని—ఈ మధుపాత్ర మీకు......యిది ఆయనకు.

ఆనందభిక్షువు—వద్దు వద్దు. (పచారుచేస్తూ నిలిచి) మాలినీ !

మాలిని—మబ్బు పట్టినట్టు మీ మొహమంతా దిగులుగావుంది. కొంచెం మధువుసేవిస్తే హుషారుగావుంటుంది. ఈ కాస్త తీసుకోకుంటే వప్పుకొనేదిలేదు.

ఆనందభిక్షువు—(తడబడే మాటలతో) మాలినీ నేనెందుకువచ్చానో చెబతాను......ఉజ్జయినిలో నీఅంత...... కాదు......సౌందర్యమూ......ఉహుఁ నేనెందుకు వచ్చానంటే, మానవులూ......నువ్వు......

మాలిని—(బిగ్గరగా నవ్వుతున్నది.)

ఆనందభిక్షువు—నువ్వు చక్కనయినదానవు—

మాలిని—(పెంకితనముగా) అలాగునటండీ నాకు తెలీనే తెలీదూ ?

ఆనందభిక్షువు—నన్ను సరిగ్గా అర్థం చేసుకో ఇటుచూడు మాలినీ నిన్ను చూసినపుడు వెన్నెలరాత్రి నిమ్మచెట్టు నీలినీడ లో నించున్నట్టు, రేరాణిపూలతో నిండిన దోసిలిలో మొహా న్ని దాచుగున్నట్టు అయిపోతుంది.

మాలిని—(నవ్వుతూ) నిజమే ?

ఆనందభిక్షువు—సాయింత్రం ఇంద్రధనుస్సు వుదయిస్తే వానకోసం పరిగెత్తుకువచ్చి పైకిచూసే నెమిళ్ళలాగ ఎందరో ధనవంతులు నీకోసం చూస్తారు. రాత్రికి నువ్వెంత పుచ్చు కుంటావూ ?

మాలిని—(నాజూకుగా చూస్తూ చిరునవ్వుతో) అంత అవసరంగా అడుగుతున్నారేం ?

ఆనందభిక్షువు—వ్రాళ్ళో చెప్పుకోగా విన్నాను. వెయ్యి వరహాలు ఒకొకరాత్రికి బుచ్చుకుంటావు. అంతధనమూ తమ శక్తీ నీకు......నీసౌందర్యంకోసం ధారపోస్తారు కాని-జీవనా !

(జీవనుడు తన కాషాయోత్తరీయము మాటునుంచి ఒక కపాలమును ఆనందునిచేతి కిచ్చినాడు. ఆనందుడు కపాలమును టేబిలుమీద నుంచినాడు.)

మాలిని—(కపాలమును చూసి భయపడి కెవ్వున కేక వేసి వెనుకనున్న సోఫాలోపడి ఆపాదమస్తకమూ గడగడ వణకిపోతూ ఉన్నది )

ఆనందభిక్షువు—ఇది మానవకపాలం !—భయమెందు-
కు ? ఎప్పుడో ఒకనాడు మన తలలుకూడా యిలాగునే అయి-
పోతాయి.

మాలిని—(కపాలాన్ని చూస్తూ తనజడను చూసు-
కొన్నది.)

ఆనందభిక్షువు—(కపాలాన్ని చూసి దాన్ని ఉద్దేశించి)
ఈనాడు నిన్నుచూసి మనుష్యులు జడుసుకొంటున్నారు. నీవేపు
చూస్తే వాళ్ళ హృదయాలు భయంతో జలదరిస్తున్నాయి !
గనక కళ్ళు మూసుకుని నిన్ను తమమనస్సులలోనుంచి తరిమి
వేస్తున్నారు. ఓహో ! కపాలమా ! ఒకప్పుడు నువ్వెంత
వైభవం అనుభవించావు !

జీవనభిక్షువు—[కన్నీరు]

ఆనందభిక్షువు—మాలినీ ! వెన్నెల సముద్రతరంగాల
మీద పడినపుడు కల్పించే నున్నని మెరుగు నీ కనులలో వుంది.
నీకన్నులనుంచి ద్రాక్షపండ్లులాగున వకుళ పువ్వులలాగున జారి
వచ్చేచూపులకోసమని ధనవంతులు దివా రాత్రాలు నీగృహా
ద్వారంలో పాలరాతి చప్టాలమీద కూచుని తపస్సులు చేస్తు
న్నారు. గాని (కపాలంలోని రెండు కంటి కన్నాలను చూపిస్తూ)
వీటివేపెవరూ చూడనయినా చూడరేం ? నీబుగ్గలు గులాబీ
రంగులో నిగనిగలు తేరి మెత్తగా వెన్నవలె ఆకర్షకంగా వున్నా

యి. నీనోరు చిన్ని మంకెనపువ్వువలె సొగసుగావుంది. నువ్వు నవ్వినపుడు వానజల్లు పడినపుడూ, హృదయాకోకిలలు కూసినపుడు కలిగే ఆనందం కలుగుతుంది. కాని (కపాలం నోరును చూపిస్తూ) ఈనోటివైపు ఎవరూ చూడరెంచాతను? చెప్పు మాలినీ?

మాలిని—(తన ప్రతిబింబాన్ని నిలువుటద్దంలో చూసుకొని ఏడుస్తూవున్నది.)

ఆనందభిక్షువు—ఏడవకు! ఏడవకు!—ఈ కపాలం యిపుడంటే యీ విధంగా దిక్కూ మొక్కూ లేక తన్ను చూసేవారూ ఆదరించేవారూ లేక వికారంగానూ భయంకరంగానూ వుందిగాని ఒకప్పు డిదెలా వుండేదనుకొన్నావు? ఈకంటి కన్నాలు యిపుడిలాగున్నాయిగాని అపుడు యిక్కడ సోగకన్ను లుండేవి! ఈ గుండుమీదను ఒకప్పుడు పట్టులాగ మెత్తనయిన జుట్టు నాగుబాముువంటి జడ వుండేది. ఇక్కడ సన్నని ఎరుపయిన పెదవులూ యిక్కడ మెరిసే బుగ్గలూ.........ఎంత చక్కగా వుండే దీ తల.........ఈమెను ఎందరెందరు ప్రేమించేవారు. ఈమె చూపుకోసం ఎంత తపించేవారు. ఒక్కరాత్రికి సరసుడు ఈమెకు నాలుగయిదు వేల వరహాలు యిచ్చేవాడు. కాని ఇపుడు ఎవరయినా ఒకడు...ఒక్కడు...ఒఖడు.........యీ కపాలానికి ఒక్కవరహా దయతలిచి అయినా యిచ్చేవాడున్నాడా?

మాలిని— (అద్దంలో చూసుకొంటూ తన జుట్టును చెంపలను పెదవులను కన్నులను మృదువుగా తాకుకొంటూ కన్నీళ్ళతో) నే...నూ... నేనూ... అలాగ అయిపోతానా? ఆనందభిక్షూ! (ఆత్రుతతో జవాబుకోసము అతని మొహాము లోనికి చూస్తూ ఉన్నది.)

ఆనందభిక్షువు—(నవ్వి) ఎంత అమాయకురాలవు మాలినీ! జన్మించిన ప్రతిజీవీ మృతించితీరుతుంది. పుట్టుకా చావూ, అనేవి రెండూ జీవితానికి రెండు కన్నులు. మనందరముకూడా ఎపుడో ఒకపుడు చచ్చి పోతాము!

మాలిని—(బెదురుగా) చచ్చి పోవడమా! అబ్బ! చచ్చిపోవడమా! చచ్చిపోయిన తరవాత యిలా... యిలా... (కపాలాన్ని చూపిస్తూ) అయిపోవడమా? (గొంతులో ఏడుపు తరంగాలుగా వస్తున్నది) ఆనందభిక్షూ! ఆనందభిక్షూ! (అతని పాదాలవద్ద మోకరిల్లి) నాకు చావువద్దు! నన్ను చావునుంచి రక్షించు! చావును నాదగ్గర్నుంచి తరిమివెయ్యి. దాన్ని నా దగ్గరకెన్నడూ రావద్దని చెప్పు! నేను చచ్చిపోలేను. నాకు చావువద్దు. మాఅమ్మ చచ్చిపోయినపుడు చూశాను. చావంటే చక్కని వాళ్ళంతా... మెత్తని నున్నని వాళ్ళంతా గట్టిగా ఐపోతుంది. కళ్ళల్లోని దీపాలు ఆరిపోయి కళ్ళు మూసుకుపోతాయి. వక్షమంతా వికారమయి పోతుంది. ఆ తరవాత యిలా... యిలా... వద్దువద్దు... ఆనందభిక్షూ! (ఏడుస్తూ ఉన్నది)

ఆనందభిక్షువు—(చిరునవ్వుతో) మృత్యువునుంచి ఆతథాగతుడే తప్పుకోలేకపోయినాడు. వద్దంటే అది రాక మానివేస్తుందా? (జాలితో) ఇంత మెత్తనిగుండెగలదానవు, యింత అమాయకురాలవు, యీపాపకూపంలోకి ఎలా జారిపోయినావు? మాలినీ! ఎందుకేడుస్తావు? ఏడవవలసిన అవసరమేముంది గనుక? మృత్యువనేది తప్పని విషయం. దాన్నిగురించి పాపాత్ములు మాత్రమే భయపడతారు. పాపాత్ములనే అది తన పంటి రంపాలతో, కరకర కొరికి నమిలివేస్తుంది.

మాలిని—(అతని కాళ్ళను కౌగలించుకొని భోరుమని ఏడుస్తూ) నేను... నేను...మహా పాపిని...మృత్యువు నన్ను—

ఆనందభిక్షువు—నిన్ను ఆతథాగతుడు రక్షిస్తాడు భయపడకు! నువ్వూ నీవలన ఎందరెందరో యువకులూ, ఆనందమనే భ్రాంతిలోపడి దుఃఖపాప పంకిలంలో పడిపోతున్నారు. ఉజ్జయినిలో నున్న ధనిక యువకులంతా నీవలన పాపంలో పడిపోయినారు. ముందు నిన్నా బురదలోనుంచి పైకి తీయడానికని వచ్చాను. పాపజీవితం గడిపేవాళ్ళవెనక మృత్యువు చీకటి పొగులాగ, తుపాను గాలిలాగ, రాక్షసాకారంతో, నడుస్తూ అనుక్షణమూ ముందుకు తన పొడుగైన నీడను వేస్తూవుంటుంది. కాని ధమ్మపథంలో, నిబ్బాణానికి శాంతిగా నడుచుకుపొయ్యే వాళ్ళవెనక, మలయానిలంలాగ, వెన్నెలవెలుగులాగ, నడుస్తూ

అప్పుడప్పుడు తన మధురపరిమళాలను ముందుకు జిమ్ముతూ తుదకు హేమంతంలోని పొగమంచువలె వాళ్ళను ఆవరించుకుంటుంది. హాయిగా వాళ్లు స్వర్గానికిపోయి తిరిగి యీలోకంలో ప్రుత్తమజన్మ ఎత్తుతారు. కొన్ని జన్మలతరువాతను నిర్వాణము చేరుకొంటారు. గనక ముందు యీపాపపంకిలంలోనుంచి బయటపడాలి! లేకుంటే పాపాల బరువు మొయ్యలేక చతికిలబడిపోయి మనల్ని వెంటపడుతూన్న, పరుగెత్తుకుని వస్తున్న క్రూర మృత్యువుకి దొరకిపోతాము. మరణించాక కొంతకాలం మహానరకంలో అనేకబాధలు అనుభవించాలి. ఎటువంటి బాధలనుకున్నావు? అక్కడ అగ్నిసరస్సులుంటాయి. ఆసరస్సులలో అగ్ని నీరుగా కరిగిపోయి ప్రుడుకుతూ పెద్దపెద్ద కెరటాలుగా లేస్తూ వుంటుంది జ్వాలలు ఆకెరటాలుమీదగా ఎగురుతూవుంటాయి. ఆ సరస్సులో ఆకెరటాలకింద ఆజ్వాలలనడుమ కొంతకాలం... కొంతకాలం అంటే కొన్నిసంవత్సరాలు పడుకోవాలి !!

మాలిని—(కళ్లుమూసుకొని మూల్గుతూ ఏదో బాధ అనుభవిస్తున్నది. తను అగ్నిసరస్సులో ఉన్నట్లుగా ఊహించుకొని యిటు అటు దొర్లుతూ వేడివేడి నిట్టూర్పులు విడుస్తూ) భిక్షూ భిక్షూ...నన్నిందులోనుంచి బయటకు తియ్యి...అమ్మో శరీరం కాలిపోతూంది...

ఆనందభిక్షువు—తరవాత నరకవాసులు వాడిఅయిన శూలాలతో శరీరాన్ని పొడుస్తారు. ఖడ్గాలతో ముక్కలుము

క్కలుగా నరుకుతారు. రంపాలతో తలను మధ్యకు చీలుస్తారు. రక్తాలు ధారలుధారలు కారుతాయి.

మాలిని—(రోదిస్తూ సోఫాలో యిటు అటు దొర్లుతున్నది. ఆమెజుట్టు చెదిరినది. మొహమంతా పాలిపోయినది)

ఆనందభిక్షువు — ఈ విధంగా అనేకరకాల బాధలు చాలాకాలం అనుభవించి తిరిగి యీలోకంలో ఏదో నీచజన్మ ఎత్తాలి. జన్మాంతమందు మళ్లా నరకం. ఇలాజన్మలూ, నరక బాధలూ, మారునికి ఒకసారి లొంగిపోతే, అతను పాపంలోనికీ, పాపఫలితమయిన దుఃఖంలోనికీ తోసివేస్తాడు. ఒకసారి ఆ దుఃఖమనే వలలో జిక్కుకొంటే జీవి మరి ఒకంతటికిగాని బయటకు రాలేదు. అందులోనుంచి బయటకు తీయగలసమర్థుడు ఆ తథాగతుడు ఒక్కడే మాలినీ! ఏడవకు! తథాగతుని శరణుపొందు! ఆయనను స్మరించు! నీకు నిర్వాణానికి సరిఅయిన దోవ చూపిస్తాడు.

మాలిని—(లేచికూర్చొని తలవంచి దీనముగా తథాగతుని స్మరించుకొన్నది)

ఆనందభిక్షువు— మారుడు తన పరివారగణముతో ఎప్పుడూ సౌందర్యంగల చోటులందే తిరుగుతాడు. అక్కడనే తన ప్రతాపం చూపిస్తాడు. చీకటి నిద్రను ఎలా ఆకర్షిస్తుందో, ఆలాగు నీ జడ మోహాన్ని ఆకర్షిస్తూంది. ఆ జడను...కత్తిరించి వేస్తే...

మాలిని—(నిలుచుని నిలువుటద్దంలో తన ప్రతిబింబ మును చూచుకొన్నది. జడను ముందుకు తీసుకొని దానిని తన వక్షమున కదుము కొని ముద్దుపెట్టుకొన్నది. వెనుతిరిగి వెంటనే టేబిలుమీద నున్న కపాలమును చూసి నిలువునా కంపించిపో యినది. మళ్లా తన జడను చూసుకొన్నది. ఆమె కనులనుంచి బాష్పబిందువులు జలజల జడమీదకు రాలినవి. మెల్లగా నడుస్తూ పడమరద్వారమునుంచి యింట్లోనికి వెళ్ళిపోయినది)

ఆనందభిక్షువు—(తన మనస్సు చివుక్కుమనడంచాత మొహం విమ్నంగా అయిపోయినది) పాపం (రెండుసారులు టేబిలు దగ్గరకు పచారుచేసి అద్దంముందు నిలచి) తెగిపోయిన ముక్తాహారంనుంచి జలజల జారిపోయే ముత్యాలవలె కన్నీటి చినుకులు ఆ జడమీదపడ్డాయి (చప్పున పై భావమును దులు పుకొని, ఆనందం తెచ్చుకుందుకు యత్నిస్తూ) జీవనా! జీవనా! జయించాము, ఉజ్జయినిలోవున్న వేశ్యలందరిలోను ప్రసిద్ధికెక్కిన ఎందరెందరో ధనవంతుల్ని నరకకూపంలోనికి త్రోస్తున్న మాలి నిని సంఘంలో చేర్చాము. భిక్షుణీ అయిపోయింది. ఆనాడు తథాగతుడు మారుని జయించినపుడు ఎంత ఆనందం పొంది నాడో యిప్పుడు మనంకూడా అంతపొందాలి. మాలినిని జయిం చడమంటే ఒక విధంగా మారుణ్ని జయించడం అన్నమాట!

జీవనభిక్షువు—(పైమాటలు విన్పించుకోలేదు. గబగబ వెళ్ళి కపాలమునుస్పృశిస్తూ నేత్రచూపులు చూస్తున్నాడు)

[మాలిని వచ్చినది. తనచేతులోని కత్తెరతో చటుక్కున తన జడను కత్తిరించి కపాలముచుట్టూ పామువిధముగా వుంచి విషాదపూరితమయిన నవ్వునవ్వినది. జడక్రిందకు పడినది]

ఆనందభిక్షువు—భిక్షునీ!

మాలిని—(తలవంచి శాంతముగా నగవుతో) గురూ!

ఆనందభిక్షువు—నేనుకాదు మాలినీ; గురువు ఆ తథాగతుడు. కాషాయచీర ధరిస్తే పూర్తిగా భిక్షునివేగదా!

మాలిని—సుగతుని కరుణకోసం ఏమయినా చేస్తాను (లోనికివెళ్ళిపోయినది)

జీవనభిక్షువు—మరణం నీడలా మన వెనకాలే వస్తూ వుంటుందా ?

ఆనందభిక్షువు—ఏమిటి జీవనా అలా అడుగుతావు? నీకు తెలీదూ ?

జీవనభిక్షువు—తాచుపాము లాగు మూడుతలల పడగ ఎత్తి, ఆడిస్తూ మనవెనకనే వెంబడిస్తుంది! ఏనిమిషాన్నయినా అది కబళించివేయవచ్చును. బ్రతికిన రెణ్ణాళ్ళూ యిలాగున ఎందుకు బ్రతకాలి?... జన్మలు ఎలాగునా వున్నాయి. నిర్వాణము చనిపోగానే రాదుగదా!... ఈనోమరిజీవితంలో ఏమి ఆనందమున్నది?...(టేబిలుమీద ఉన్న మధుపాత్రికదీసి మధువును గడగడ తాగివేస్తూ ఉన్నాడు)

ఆనందభిక్షువు—వెర్రెత్తిందా ? ఏమి టాపని ?

జీవనభిక్షువు—(తలవంచుకొని ఆలోచన చేస్తూ బయటికి వెళ్ళిపోతున్నాడు)

ఆనందభిక్షువు—(తొందరగా వెళ్ళి అతన్ని పట్టుకొని నిలిపి) జీవనా ! జీవనా ! ఎక్కడికి ? ఏమిటి ?... ... ...

జీవనభిక్షువు—(చటాలున తన చేతులోని భిక్షాపాత్రను కిటికీలోనుంచి బయటికి విసిరివేసి) సన్యాసాశ్రమానికి సన్యాసమిస్తున్నాను !... ... ... వెళ్తున్నాను.

అనందబిక్షువు—.ఎక్కడికి ?

జీవనభిక్షువు—మధురమయిన లోకంలోనికి... ... ... మాయింటికె... ... ... ... ... ...

ఆనందభిక్షువు—(ఆశ్చర్యంగా) ఎందుకూ ? ఏమిటిటు వంటిబుద్ధి పుట్టింది ?

జీవనబిక్షువు—ఎందుకా ... ... ... బాగా తాగడానికి, మాలినివంటి యువతులతో వినోదించి బదికిన నాలుగునాళ్ళూ హాయిగా—

ఆనందభిక్షువు—(విచారముతో) తథాగత ! ఇతన్ని మారుడికెందుకు వప్పగించావు ?

జీవనభిక్షువు—(నవ్వుతో) గురూ ! మారుడు చాలా మంచివాడు. అతనికి నన్ను వప్పగించింది తథాగతుడు కాదు. మీరు !

ఆనందభిక్షువు—(ఆశ్చర్యముతో) నేనా?

జీవనభిక్షువు—అవును మీరే! (ఆతని కాళ్ళపై మోక రిల్లి) నాకు ధమ్మపథం, నిబ్బాణానికిదోవా, బుద్ధుడుకాదు మీరే చూపించారు మృత్యువు పొగమంచుమాదిరి ఎపుడూ మనలిని ఆవరించుకునే వున్నదనేసంగతి యింతనమ్మకంగా నాకు యిదివరకు తెలీదు. మీ వుపన్యాసంవల్ల తెలుసుకున్నాను. మృత్యు వేనిమిషాన్నయినా నన్ను మింగేయవచ్చును గనుక ఆనందముగా, హాయిగా ప్రికృతి యిచ్చిన యింద్రియాలను తృప్తిపరుస్తాను. మృత్యువువచ్చినపుడు నాఅంతట నేనే దాని గులాబీ నోరును తెరిచి విడీ విడని కమలంలో ప్రివేశించే తుమ్మెదలాగా అందులో ప్రివేశిస్తాను. (ఆనందుని పాదము లను కనులకు అద్దుకొంటూ, నేలను పడివున్న జడనుచూచి తీసి, తన కన్నీళ్ళతో తడిపి, లేచి, నిలుచుని, జడను హృద యానికి హత్తుకొని) యమునానదివలె ఎంతబావుందీ జడ! హం సలవలె తెల్లని చిన్నిపువ్వ లెలాకదులుతున్నాయి ఇందులో (తూరుపుద్వారమునుంచి వీధిలోనికి వెళ్ళిపోయినాడు)

మాలిని (లోనుంచి శాంత స్వరమున) బుద్ధంశరణం గచ్ఛామి. (1935 రచన).





రాత్రి రెండవజాము.

వనాంతరమున నొక గుహలో. గుహలోతుగానూ దిగుడుగానూ ఉన్నది. ఎదురుగా నొకనల్లని తెర ఉన్నది. తెరవెనక, లోనికక్ష్యలో వెలుగుతున్న ఆముదపుజ్యోతుల మసక వెల్తురు బయటికికూడా ప్రసరిస్తున్నది.

గుహాముఖమున వనపతి నిలుచున్నాడు. అతడు యిరువదినాల్గుదాటిన యువకుడు. శ్యామగాత్రుడు. అతనివాక్కు గంభీరము. దృక్కు నిశితము. అతనిచేతిలో నొకచక్కని అడవిపూవులగుత్తి ఉన్నది.

వనపతి—(గుహాంతరాంధకారములోనికి చూస్తూ నెమ్మదిగా) శ్రీ!

(నిశ్శబ్దము)

వనపతి—(రెండడుగులు ముందుకు నడిచి కాస్త గట్టిగ) శ్రీ!

(మరల నిశ్శబ్దము)

వనపతి—శ్రీ! శ్రీ! ఎంత పిలచినా పలకవేమి?

(గుహాంతరమునుండి శ్రీకంఠము) "ఎవరది?"

వనపతి——ఎవరా? (నవ్వి) తపస్వినీ! ఎవరు పిలుస్తున్నారో తెలుసుకోలేనంత అమాయకురాలవా నువ్వు?

శ్రీకంఠము——(కఠినముగా) మీరెవరో నాకు తెలియదు. మీమాటలలో సారళ్యం లేదు. బాబాకోసమని వచ్చారా? ఆయన యింట్లో లేరు.

వనపతి——మాయ! మాయ! నేనెవరో నీకు తెలియదుకదూ? వనపతిని నిశ్చయగనే యెరగవు కదూ?

శ్రీకంఠము——నీవా వనపతీ?

వనపతి——అవును తపస్వినీ నేనే! ఇటొకసారి రారాదా?

శ్రీకంఠము——ఎందుకు?

వనపతి——క్షణం హాయిగా మాట్లాడుకోవచ్చును.

శ్రీకంఠము——నీవింకా పండుకోలేదా?

వనపతి——నిద్రా? వనపతికి నిద్రయెందుకు వస్తుంది? బయట తరుశిరస్సులలో పక్షులుకిచకిచమంటున్నాయి. వెన్నెల జలపాతం నీళ్లలోపడి నీటికి రజతత్వం కలిగిస్తూంది. రాతిబండల మీద కూర్చుని మీనాయనగారి శిష్యులు భైరవీ గ్రంథాలు వల్లించుకొంటున్నారు.

శ్రీకంఠము——నిజమే కాని ఇపుడు రాత్రి రెండవజాము.

వనపతి——మరి ముగిపించకు! ఒక్కసారి యిటురా! నాకు దూరంగా నిలుచో! ఏవో నాలుగు మాటలాడుకుని ఎవరి కక్ష్యంలోనికి వాళ్లం వెళ్లిపోదాము.

శ్రీకంఠము—నేనురాను. నువ్వు వెళ్లిపోయిపండుకో!

వనపతి—శ్రీ!

శ్రీకంఠము—నేను రావడానికి వీలులేదు.

వనపతి—ఎందుచేత ?

శ్రీకంఠము—ఇక్కడ నేనేమిటిచేస్తున్నానో తెలుసునా ?

వనపతి—పూలమాలికలు గుచ్చుతున్నావా ?

శ్రీకంఠము—లేదు (మౌనము)

వనపతి—మరేమిటి చేస్తున్నావు ?

శ్రీకంఠము—ఏమీలేదు. నీవుపోయి పండుకో. చాల రాత్రయింది.

వనపతి—నీవేం మహాకార్యం చేస్తున్నావో విని నే నానందించకూడదు కాబోలు నే !

శ్రీకంఠము—ఛురికను పదునుపెడుతున్నాను.

వనపతి—(చకితుడై) కత్తిని బండరాతిమీద నూరుతున్నావా ? అవును అదుగో ఛురిక గుహాంతరాంధకారంలో మేఘంలో మెరుపువలె తళుక్ తళుకని మెరుస్తూంది.

(నిశ్శబ్దము)

వనపతి—శ్రీ !

(శ్రీ బరువుగా నిట్టూర్పినట్టు వినపడినది)

వనపతి—(జాలిగా) శ్రీ ! పిలుస్తున్నాను. ఒక్కసారి రావూ ?

(గుహాంతరములోనుండి శ్రీ వచ్చి వనపతికి కొంచెము దూరములో నిలచినది. ఆమె యిరువదిదాటిన యువతి. సంపెంగపువ్వువంటి శరీరచ్ఛాయ. విశాల నయనములు. దూరావన శ్రీ గల ఎఱ్ఱని చిరుపెదవులు. జుట్టు విరియబోసికొనినది. ధౌతవసనమును ధరించి ఉన్నది. ఫాలమున రక్తచందన రేఖగలదు.)

శ్రీకంఠము—మహామాంత్రికుని మంత్రోచ్చారణతో అప్రయత్నంగా వచ్చే పిశాచివలె నేను నీపిలుపుతో వచ్చాను కాదా ?

వనపతి—కాను. కాను. సుఖనిద్రలోని స్వప్నవనాల్లోనికి నందనంనుంచి దిగివచ్చే అప్సరః కన్యలాగున వచ్చావు.

శ్రీకంఠము—స్వర్గమంటే నీకు నమ్మకముందా? అప్సరసలున్నారంటె నమ్ముతావా ? దేవుడే లేడని భైరవదేవి శక్తి స్వరూపిణి కాదనీ నువ్వు చెప్పలేదా ?

వనపతి—నేను దేవుడున్నాడని నమ్మను. భైరవి శక్తి అంటే నాకు నవ్వువస్తుంది.

శ్రీకంఠము—(కోపంతో) భైరవిని తూలనాడకు. నేను సహింపలేను.

వనపతి—తపస్వినీ! భైరవిని ధ్యానించడ మెందుకు? కాలమంతా ఆ రాతివిగ్రహానికి అలంకరించడంలో వ్యర్థంచెయ్య డమెందుకు?

శ్రీకంఠము—వనపతి! నాకు జ్వరం వస్తూంది నీమాటలు వింటూంటే.

వనపతి—రాత్రీ పగలూ ఆవిగ్రహం ఎదట కూర్చుంటావు. పూలమాలికలు గుచ్చుతావు. నిశీథాలు మేలుకుంటావు. వెర్రి వెర్రి గీతాలు పాడతావు. కాని ఒకపాత్ర ఆసవం త్రాగావా? ఒకసారి.........

శ్రీకంఠము—ఊరుకో! ఊరుకో! నాస్తికుడా!

వనపతి—నేను నాస్తికుణ్ణే గాని నాకు జీవితమంటే యేమిటో తెలుసును. మీనాయనగారికి నేటికి యెనభై సంవత్సరాలు వెళ్ళినాయని చెప్పినావు. కాని ఆయనకు జీవితమంధకారం. అంతకంటె మరేమీ కాదు.

శ్రీకంఠము—ఆ అంధకారంలో భైరవీదేవి దివ్యజ్యోతి.

వనపతి—(బిగ్గరగ నవ్వుతున్నాడు)

శ్రీకంఠము—నేనిక నిలుచోలేను. వెళ్లుతాను. (వెళ్లిపోయినది)

వనపతి—క్షణమాగు వెళ్ళిపోదువుగాని.

శ్రీకంఠము—ఎందుకు ? కథలు చెప్పుకొంటూకూర్చు నేందు కిది సమయంకాదు. నాయనగారు వచ్చేవేళకూడా అయింది. నన్ను వెళ్లనీ !

వనపతి—ఈరాత్రి నీతో ఒక్కమాట చెప్పవలెనని వుంది అందుకనే పిల్చాను.

శ్రీకంఠము—ఏమిచెప్పినా వింటాను గాని భైరవ దేవిని మాత్రం తూలనాడకు. అది విని నేను సహించలేను. నువ్వు దేవిననే ప్రతివాక్యం పిడుగువలె నాగుండెలో పడుతుంది. వనపతీ ! ఏమైనా మాట్లాడుగాని దేవిని దూషించకు.

వనపతి—మీ దేవతను దూషించేందుకు నిన్ను పిలవ లేదు. తపస్వీ !... ...ఒక్క ప్రశ్నకు జవాబుచెప్పు.

శ్రీకంఠము—ఏమిటది ?

వనపతి—నాలుగు రోజులనుంచి నువ్వు నన్నెందుకు తప్పుకొని తిరుగుతున్నావు ?

శ్రీకంఠము—(నిశ్శబ్దము)

వనపతి—మొన్న సాయంత్రం నిన్నుపిల్చాను. విన్పించు కొని కూడా పూజాకృత్యంలోనికి వెళ్ళిపోయినావు. నిన్నటి ఉదయంపిల్చాను, వెనుదిరిగి నన్నుచూచికూడా నాతోమాట్లా డలేదు.

శ్రీకంఠము—నువ్వు మానాయనగారి చేతులోనున్న బంధితుడవుకావా ? బంధితునితో మాటలేమిటి ?

వనపతి—అవును నేను బంధితుడనే. మీనాయన నన్ను మోసగించినాడు. నాచేత ఆనాడు త్రాగించినాడు. ఆసవం పేరు వింటేనే మాకు చైతన్యంపోతుంది. మరి ఆసవపానంతో నిశ్చేతనుడనై పోయినాను. నన్ను బంధించినాడు. నన్నిక్కడకు తెచ్చి ఆకక్ష్యంలో వుంచాడు. ఇపుడు నే నే దేశంలో వున్నానో నాకు తెలియదు.

శ్రీకంఠము—నాయనగారి ననవసరంగా నిందించకు.

వనపతి—నిందించను. నా కేదేశమైతే నేమి. నాకు కావలసింది ఆసవం, యౌవనానుభవం.

శ్రీకంఠం—(చప్పున అటుతిరిగి) వెళ్లుతాను.

వనపతి—(ఆమె చేతిని పట్టుకొని) మాటవిను!

శ్రీకంఠం— వనపతీ! చెయ్యివదులు.

వనపతి—శ్రీ!

శ్రీకంఠం—ముందు చెయ్యివదులు. నాశరీరం కంపిస్తూంది.

వనపతి—అదే విద్యుచ్ఛక్తి.

శ్రీకంఠం—భైరవి కల్పించిన యీశరీరాన్ని నీస్పర్శవల్ల కళంకితంచెయ్యకు. చెయ్యి విడిచిపెట్టు.

వనపతి—నీపెదవు లదురుతున్నాయి. కన్ను లుజ్వలంగా ప్రకాశిస్తున్నాయి. నీచేయి ఒక్కసారిగా వేడిగా అయిపోయింది. ఇదే విద్యుచ్ఛక్తి. ఈశక్తి నీలో వుంది. నాలో వుంది.

విశ్వంలోని సర్వజీవులలోనూవుంది. ఉన్నశక్తిని చూడలేక రాతికి శక్తి నారోపించి నీశక్తిని చంపుతున్నావు.

శ్రీకంఠం—చెయ్యి విడువు. చెయ్యి విడువు. నాయన గారు వచ్చేవేళయింది. ధూర్తుడా! దూరంగావెళ్లు!

వనపతి—ఎప్పుడో వొకపుడు నేను నీకు దూరంగా వెళ్లిపోతాను కాని యీరోజుమాత్రం కాదు.

శ్రీకంఠం—(కన్నులు మూసుకొని) మా! మా! భైరవీ!

వనపతి—శ్రీ! నీశరీరం భైరవిదికావడానికి వీలులేదు. ఇటువిను.

శ్రీకంఠము—నన్ను విడువు చార్వాకుడా!

వనపతి—నేను చార్వాకమతస్థుడనే ఈలోకమానంద మయమనే విషయం నాకు చార్వాకగురువే వుపదేశించాడు. శ్రీ! నువ్వొకసుందరపుష్పానివి. నిన్ను ఆ రాతివిగ్రహం ముందల వాడిపోనీయలేను. నేను నీ పరిమళమాఘ్రాణిస్తాను.

శ్రీకంఠము—వనపతీ! వనపతీ! (శరీరమంతా కంపించు తున్నది.)

వనపతి—శ్రీ! ఒక్కముద్దు! ఒక్క. కౌగిలి!

శ్రీకంఠము—(చటుకున చేయి విడిపించుకొని ఉన్మత్తు రాలివలె గుహాంతరంలోనికి జుట్టు గాలిలో ఎగురుతున్నట్లు పరి

గెత్తుకపోయి అంధకారంలో మరికానరాదు. ఆమె మాటలు మాత్రంవినబడుతున్నవి.)

వనపతి—తపస్వినీ! తపస్వినీ!

శ్రీకంఠము—ధూర్తుడా! మరినన్ను పిలువకు!

వనపతి—రావ్రుకదూ ?

(గుహాబయట బండరాళ్ళమీాద పాదుకలధ్వని వినబడుతున్నది)

శ్రీకంఠము—విను! విను! పాదుకలధ్వని! నాయన గారు వస్తున్నారు.

వనపతి—నువ్వింతకఠినురాలవా? కోమలమైన నీశరీరం చూచి నీహృదయంకూడా మృదువనేభావించానుసుమా?

శ్రీకంఠము—మాటాడకు! మాటాడకు! నాయన గారు వస్తున్నారు.

వనపతి—ఛురికను బండరాతిమీాద నతిత్వరితంగాపదను పెడుతున్నావెందుకు?

శ్రీకంఠము—అవును అవును నాయనగారు వస్తున్నారు కదామరి.

వనపతి—(విచిత్రమయినహాసము)ఛురిక ... ఛురిక ...

శ్రీకంఠము—ఎందుకు నవ్వుతున్నావు వనపతీ?

వనపతి—మానవులమూర్ఖత్వాన్నిచూాస్తె నవ్వువస్తూంది.

శ్రీకంఠము—ఏమి టది?

శ్రీ

వనపతి—భైరవీపూజ ... శిలాపూజ ... చిన్నపిల్లల ఆటవలె—

శ్రీకంఠము—చాలించు! చాలించు! నాస్తికుడా!

(గుహాద్వారంనుండి కాపాలికుడు లోనికివస్తున్నాడు. అతడు ఎనుబది వత్సరములు దాటినవృద్ధు. ఆజానుబాహువుగానివయోభారముచేత నడుమువంగిపోయినది. శరీరము ముడుతలుపడినది. కనులు విశాలములేగాని కాంతిరహితములు. నుదుట రక్తచందనమున్నది చేత నొకసజ్జలో ఎఱ్ఱగన్నేరుపూలున్నవి. పెదవులలో నేదోమంత్రమును గొణుగుకొంటున్నాడు.)

కాపాలికుడు—అబ్బాయీ! నీపేరు మళ్లా మరిచిపోయినాను.

వనపతి—నేటికి నాపేరు తమరొకవేయిసార్లు మరచిపోయినారు. నేనొకవేయిసార్లు చెప్పినాను.

కాపాలికుడు—వయస్సు ముదిరిపోయింది. దానితో నే జ్ఞాపకశక్తికూడా నశిస్తూంది.

వనపతి—లేదు. లేదు. మీరెన్నడూ భైరవిమంత్రాలనుగాని మరచిపోయినట్లు కనబడదు.

కాపాలికుడు—భైరవిని మరచిపోవడమా? భైరవీమంత్రాలు మరచిపోవడమా? నాశరీరంలోనుండి ప్రాణవాయువు లెగిరిపోయినా యీపెదవులు భైరవీనామం జపిస్తాయి. ఈమెదడులో భైరవీరూపం నిలచివుంటుంది.

వనపతి—నాపేరు వనపతి.

కాపాలికుడు—రాత్రి రెండవజాము దాటవచ్చింది. నువ్వు యింకా పండుకోలేదేమి ?

వనపతి—నిద్రరాలేదు.

కాపాలికుడు—(ఆలోచించి)నిద్రించకపోవడంమంచిదే. ఈరాత్రి...నిద్రరాకపోవడం మంచిదే.

(కాపాలికుడు ఎదురుగా ఉన్న నల్లనితెరను కొంచెము తొలగించుకొని లోనికత్యలోనికి వెళ్ళిపోయినాడు. తెరతిరిగి మూసుకొన్నది.)

వనపతి—(చేతులోని సుమగుచ్ఛమును వాసనచూస్తూ ఆలోచిస్తున్నాడు.)

శ్రీకంఠము—(కుడిహస్తమున తళుక్ తళుకని మెరుస్తున్న ఛురికను పట్టుకొనివచ్చినది.) వనపతీ ! బాబా ఎటు వెళ్ళినారు ?

వనపతి—(నవ్వి) కత్తిని బాగా నూరినావా ?

శ్రీకంఠము—(నిశ్శబ్దము)

వనపతి—శ్రీ ! ఇటురా ?

శ్రీకంఠము—ఎందుకు ?

వనపతి—నీజడపాయలు విషాన్నిగ్రక్కే-కాలసర్పముల వలె కదలుతున్నాయి. ఆజుట్టులో యీపూపులగుత్తిని తురుముతాను.

శ్రీకంఠము—నాజుట్టును స్పృశిస్తావా? సంతతమూ భైరవీమాతపాదస్పర్శచేత పూతమైన నాజుట్టును స్పృశిస్తావా?

వనపతి—(సుమగుచ్ఛమును దూరంగా విసరివేసినాడు) సరే. ఇకనువ్వు వెళ్ళిపో! మరి నాకంటబడకు. నిన్ను నేను మరచిపోతాను.

శ్రీకంఠము—వెళ్లుతానుగాని మళ్లా నీకంటబడకతప్పదేమో!

వనపతి—సరే. సరే. ముందు నాచూపునుండి తప్పుకొనివెళ్లు. నీవు తపస్వినివికాదు మోహినివి. అయస్కాంతమువలె నన్నుతిదగ్గర కాకర్షించుకొంటావు. తీరా దగ్గరకురాగా దూరంగా విసరివేస్తావు నన్ను పో పో.

శ్రీకంఠము—బాబా ఎటువెళ్ళినారు?

వనపతి—పూజాకత్యంలోనికి.

శ్రీకంఠము—(అటువేపు వెళ్ళుతున్నది.)

వనపతి—(చటాలున ఆమెచేయి పట్టుకొని ఆపి) శ్రీ!

శ్రీ—అలాగు చూస్తావేమి? నీచూపు ధగధగ మెరుస్తూంది.

వనపతి—శ్రీ! నిన్ను విడిచిపెట్టను. ఈక్షణాన్ని జారవిడువను.

శ్రీ—(కంపిస్తున్నది)

వనపతి—నేను నీచేయి పట్టుకొన్నాను. గాని చేయి విడువుమని నన్ను నీవు మునపటివలె ఆజ్ఞాపించలే దెందుచేత?

శ్రీ—నన్నేమీ అడగవద్దు నాలో ప్రతిఘటించేశక్తి అంతా కరిగి నీరయిపోతూంది. నేను నీచేతిలో మంచునైపో తున్నాను.

వనపతి—నేను బంధితుడనుగా యిక్కడకువచ్చి మత్తు నుంచి కనులు తెరిచేసరికి మొదట నువ్వు కన్పించావు. నువ్వు నన్నెలాగ నాకర్షించావో నీకే తెలుసును. మాట్లాడు శ్రీ!

శ్రీ—నన్నేమీ ప్రశ్నించకు. నేను నీముందు నొక రాతివిగ్రహాన్నయిపోతున్నాను. నీమాటలు నీస్పర్శనాలోని జీవాన్ని హరించి నన్నొకరాతివిగ్రహాన్ని చేసివేస్తున్నాయి.

వనపతి—నీపెదవులూ కంఠమూ ఆవర్తములవంటివి.

శ్రీకంఠము—నేను మహోన్నతస్థానంనుంచి పాతాళం లోనికి పడిపోతున్నాను.

వనపతి—తపస్విని! ఒక్కముద్దు! ఒక్కకౌగిలి అంతే ప్రసాదించవా?

శ్రీకంఠము—పడిపోతున్నాను. ప్రతిఘటించేశక్తి నాకు లేదు. దుర్బలను భైరవీ! మా! మా!

వనపతి—ఆచిరుపెదవులమీద నొక్కముద్దు గాఢమ యిన ఒక్కకౌగిలి.

శ్రీకంఠము—వనపతీ! వనపతీ! ఆమాట అనకు. నేను పరవశురాలనై పోతున్నాను.

వనపతి—నే నింకేమీ కోరను. ఒక్క ముద్దులో నీసౌరావనామృతాన్నంతా నీపెదవుల ద్వారా పీల్చి మత్తెక్కి మరణిస్తాను.

శ్రీకంఠము—(జలదరించి) మరణిస్తావా? మరణిస్తావా? నాశరీరంలో అమృతం లేదు రక్తం లేదు. నేను పుట్టిన రెండురోజులకే మాఅమ్మ చనిపోయిందట. నాటినుంచి నాయనగారే నన్ను పెంచుతున్నారు. చిన్నతనంలో నాకాయన పాలు పోయలేదు. నాశరీరంలో వున్నదంతా విషం. నేను విషకన్యను. నన్ను తాకకు వనపతీ! చనిపోగలవు.

వనపతి—చావు అంటే నాకు భయం లేదు. నే నీక్షణాన్ని కూడా చనిపోవడానికి సిద్ధంగానే వున్నాను. కాని నిన్ను ముద్దు పెట్టుకొంటూ ఆస్థితిలో లోకాన్ని మరిచి నన్ను మరిచి మరణిస్తాను.

శ్రీకంఠము—కాలసర్పాన్ని ముద్దు పెట్టుకుంటావా? వనపతీ! నాలో ఎంత వెదకినా హృదయం కనబడదు సుమా! పిశాచిని ముద్దుపెట్టుకుంటావా?

వనపతి—శ్రీ! వింతగా మాటాడుతున్నావు.

శ్రీకంఠము—వనపతీ! ఈ ఛురిక చూడు! దీనితోనే నేనే స్వయంగా యీ చేతులతోనే పదిమందికంఠాలు ఖండించాను.

వారితలలతో భైరవీమాతను పూజించారు. ఇప్పుడు చెప్పు. ఈపిశాచిని నువ్వు కాంక్షిస్తావా ?

వనపతి—ఒక్క ముద్దు ! ఒక్క కౌగిలి !

శ్రీకంఠము—ఈ ఘాతికను చూచికూడ కోరుతున్నావా? ఈఘాతికను ముద్దుపెట్టుకొని కౌగిలించుకోగలవా? ఇది పది మందిజీవాలను త్రాగింది. నేనూ పదిమందిజీవాలను త్రావినాను.

వనపతి—(ఆమెను దగ్గరకు తీసుకొనబోతున్నాడు.)

శ్రీకంఠము—వద్దు ! వద్దు ! ఈశరీరం భైరవికి అర్పించాను. జీవితాంతంవరకు దీనిపైని మాతదే అధికారం దీన్ని నువ్వుకోరకు. దూరంగావెళ్ళు.

వనపతి—(నవ్వి) నిజంచెప్పు శ్రీ ! నీఅంతరాత్మలో నీ శరీరాన్ని నాకర్పించవలెననేకోరిక లేదూ ?

శ్రీ—(కనులు మూసుకొని) నన్నడగకు ! నన్నడగకు ! నేను మానసికాగ్నిజ్వాలల్లో కాలిపోతున్నాను.

వనపతి:—భైరవికి నిన్ను దక్కనివ్వను. ఆరాతివిగ్రహానికి నీపైని హక్కు లేదు.

శ్రీకంఠం—చిన్నతనంనుంచి భైరవసేవ చేస్తున్నాను. అంతావ్యర్థమేనా ?

వనపతి—ఒక్క ముద్దు ! ఒక్క కౌగిలి !

శ్రీకంఠం—ఒకముహూర్తం యీరైనా సంవత్సరాలై నేను చేసిన అర్చన నిష్ఫలమై పోవలసిందేనా? భైరవి కాగ్రహం రాదా? బాబా శపించడా? భైరవి ఆగ్రహానికి నేను తాళుకో గలనా? కాని... కాని... కాని... యీ...

వనపతి—నీశరీరం సలసల క్రాగిపోతూంది. నీశరీరం లోని రక్తం వుడికిపోతూంది.

శ్రీకంఠం—ఊహుఁ. వద్దు. వనపతీ! నే నెప్పుడూ భైరవి సేవికనే. ఒక్కముద్దు...వద్దు! వద్దు!...

వనపతి—ప్రసాదించవా?

శ్రీకంఠం—నన్నేమీ యాచించకు! ఒక్కముద్దుతో నాలోని యౌవనామృతాన్నంతా పీల్చి మత్తులో మరణిస్తా నన్నావుకదూ?...యౌవనామృతం... ఒక్కముద్దు... కాదు కాదు నాలోని పవిత్రత నంతటిని పీల్చివేస్తావు. దూరంగాపో.

(చేయి విడిపించుకొని తటిల్లతవలె ఛెంగున నల్లని తెర ను జిమ్ముకొని పూజాకక్ష్యములోనికి వెళ్ళిపోయినది. తెర ఒక సారి యిటుఅటుఊగి మరల ఎప్పటివిధముగా ఉన్నది. వనపతి గాఢాలోచనలోమునిగి పచారు చేస్తున్నాడు. నిశ్శబ్దము తరు వాత పూజాగృహములో సవ్వడి. నల్లని తెర రెండుగా విడి పోయినది.

ఎదురుగా భైరవీవిగ్రహము. అది భీకరాకారము. భైర వికి షడ్బాహువులు. హస్తముల నాయుధములు. భైరవదేవి

నగ్న. నయనములు క్రోధవిస్ఫారితములు. కంఠసీమను కపాల మాల. పాదములు రుధిరాభిషిక్తములగుటచే రక్తవర్ణములు.

విగ్రహమున కెదురుగా పీఠముపై వృద్ధకాపాలికుడు, వ్యాసపీఠముపైనున్న తాంత్రిక గ్రంథపఠనము చేస్తున్నాడు. ప్రక్కను పూజాద్రవ్యములు నరకపాలములు.

కొంత దూరములో శిరసువాంచి మోకరించి భైరవికి శ్రీ ప్రణమిల్లుతున్నది. శ్రీ తల ఎత్తి లేచి నిలచినది. ఆమెముఖ మంతా కన్నీటితో తడిసిపోయినది. కపోలములు ఎర్రగా అయి పోయినవి.)

కాపాలికుడు—అబ్బాయీ!

వనపతి—(వచ్చి) నాపేరుమరచి పోయినారు కాబోలును. నేను వనపతిని.

కాపాలికుడు—వనపతీ!

వనపతి—ఏమి సెలవు?

కాపాలికుడు—భైరవీదేవి ఎవరో ఎరుగుదువుకదా! ఆమె జగజ్జనని, మహాశక్తిస్వరూపిణి, అసురదళని.

వనపతి—సరే. సరే.

కాపాలికుడు—దేవికి మనమందరము బిడ్డలముకదా! అవసరముపడినపు డామెకు మనం మనప్రాణములను సైతం మర్పింపవలెను.

వనపతి—(నవ్వుతున్నాడు) శ్రీ !

శ్రీకంఠము—(ఇటు చూచినది)

వనపతి—కడసారి కోరుతున్నాను. ప్రసాదించవుకదూ?

కాపాలికుడు—శ్రీని ఏమిటి కోరుతున్నావు ?

వనపతి—ఒక్క ముద్దు—

కాపాలికుడు—(వెంటనే చెవులుమూసుకొని) పాపీ ! నాస్తికుడా! చార్వాకుడా ! (కృద్ధుడై) క్షణకాలంలో మృత్యువు నిను కబళిస్తుందని తెలుసుకో. నిన్ను భైరవికి బలివేయడానికనే యిక్కడకు తీసుకువచ్చాను. ఈరాత్రి మరొకక్షణంలో—

వనపతి—నన్నానాడు మాయచేత యీ అరణ్యంలోనికి నీవు తెచ్చిననాడే నే నావిషయం గ్రహించాను. నువ్వు కాపాలికుడవు, మానవహత్య నీమతజీవం. ఇదివరకు అనేకులను బలివేశావు. ఈరాత్రి నన్ను బలివేస్తావు. మరణమంటే నేను భయపడను.

కాపాలికుడు—ఈరాత్రి నిన్ను దేవికి బలివేస్తానని నీతో ఎవరుచెప్పినారు ? శ్రీ చెప్పిందా ? శ్రీ అపవిత్రురాలయిందా ? దేవీసేవ కనర్హురాలయిందా?

వనపతి—లేదు. లేదు. ప్రభాతవేళ నేను హాయిగా బయట జలపాతం దగ్గరకూర్చుండి పాడుకుంటున్నాను. అపుడు నీశిష్యు డొకడువచ్చి నాతో "వైరివాడా! ఈరాత్రి నీవు దేవికి

బలిఅయిపోతావుకదా! ఇపుడింత నిశ్చింతగా ఎలాపాడుకుంటు న్నావ"ని ప్రశ్నించాడు. జీవితమెలాగూ ముగిసిపోతూంది. దొరకినంత ఆనందమూ అనుభవించివేదామని హృదయమల్లా పాడినాను. మధ్యాహ్న మడవిలో నారికేళాసవం దొరకగా దానిని త్రాగివేసినాను. ఈరాత్రి శ్రీని ఒక్కముద్దు ఒక్క కౌగిలి యాచించాను; గాని ఆమె తిరస్కరించింది.

కాపాలికుడు—అమ్మా! శ్రీ!

శ్రీకంఠము—(అడకువగా) బాబా!

కాపాలికుడు—బయటను శిష్యులున్నారుకదా?

శ్రీకంఠము—గుహాచుట్టూకూడా కావలికాస్తువున్నారు.

కాపాలికుడు—నాస్తికుడా! ఇకనువ్వు సిద్ధంగావుండు. దేవిని ప్రార్థించుకో, నీకు సద్గతి కలుగుతుంది. నీకంఠాన్ని నరికేవేళ అల్లరిచేయబోకు:

వనపతి—శ్రీ!

శ్రీకంఠము—(భైరవివంక తిరిగినది)

కాపాలికుడు—అమ్మాయీ!

శ్రీ—బాబా!

కాపాలికుడు—ఛురికకు పూజచేసినావుకాదూ?

శ్రీకంఠము——ఊం.

కాపాలికుడు—వేళఅయింది, ఛురిక తీసుకోతల్లీ!

శ్రీకంఠము—(చేయిముందుకు జాపినది చేయివేళ్లూ గడగడ కంపించిపోతున్నవి.)

కాపాలికుడు—శ్రీ ! నీచేయి కంపిస్తూందేమి ?

శ్రీకంఠము—(రుద్ధకంఠమున) లేదు... బాబా ! (ఛురికను తీసినది)

వనపతి—శ్రీ !

శ్రీకంఠము—(ఛురికను పట్టుకొని నిలచినది. నలుదెసల వెర్రివెర్రిగా చూస్తున్నది. ఆమెముఖము వివర్ణముయిపోయినది.)

కాపాలికుడు— (గ్రంథావలోకనంచేస్తూ) ధ్యానం చెయ్యి శ్రీ. అబ్బాయీ ! భైరవీమాతముందు మోకరిల్లి శిరస్సువంచు నాయనా !

వనపతి—(విగ్రహాముముందు మోకరిల్లి కాపాలికునితో) నేను మీభైరవిని ధ్యానించలేను. ఆఛురికను నాచేతికేయియ్యరాదూ ?

కాపాలికుడు—ఎందుకు ?

వనపతి—శ్రీ నిలువున కంపించిపోతూంది. స్త్రీ సహజమైన పిరికితనం ఆమెను బెదురుపరుస్తుంది. ఆమెకింద పెదవి చూడండి ఎలా అదురుతూందో! ఆకింది పెదవి ఆచిన్ని పెదవి... ఎరుపయిన ఆకిందిపెదవిమీద ఒక్కముద్దు. శ్రీ ! దయలేదా ?

శ్రీకంఠము—(వక్షము తరంగమువలె ఎగిరిపడుతున్నది. ఒక్కసారి ఆమె గొంతులోనుంచి ఏదోధ్వని బయటపడి అణిగి పోయినది. ఆమెనయనముల నిండుగానీరు)

వనపతి—సరే ఆఛురికను యిలాగ యియ్యి!

కాపాలికుడు—ఎందుకు ?

వనపతి—నాశిరస్సును నేనే ఖండించుకుంటాను. ఆపనిని శ్రీ చెయ్యగలదా ? చెయ్యలేదు చెయ్యలేదు.

శ్రీకంఠము—అలాగనకు వనపతీ! నేను పిశాచిని, ఇదివరలో పదిమంది కంఠాలను తెగనరికి ఆతలలతో భైరవీసేవ చేశాను. నాలో స్త్రీత్వం నశించిందో......స్త్రీత్వమే కాదు మానవత్వమే. బాబా!

కాపాలికుడు—ఏమి తల్లీ ?

శ్రీకంఠము—(విచిత్రంగా చూస్తూ) నేను పసిపిల్లనుగా వుండేటప్పుడు నాఅంతస్సులోనికి చెయ్యిజొనిపి హృదయాన్ని పెకలించి తీసి ఏసముద్రంలోనో పారవేసినావా బాబా ?

కాపాలికుడు—శ్రీ! ఎన్నడూ చలించియెరుగని నువ్వి నాడిలాగయిపోతున్నావేమి ? భైరవిని తలచుకో! ఆనందంగా భక్తితో ఒక్కనరుకుతో వనపతికంఠం తెగవెయ్యి!

శ్రీ—వనపతికంఠం...వనపతిశిరస్సు...(ఛురికనుచూచి) బాబా! బాబా!

కాపాలికుడు—అమ్మా!

శ్రీ—నేను పడిపోతానో ఏమో! నాశరీరం వొణుకుతూంది.

కాపాలికుడు—కాస్త మధుపానంచేస్తావాబిడ్డా?

శ్రీ—వద్దు... బాబా! నేనీపని చెయ్యలేను. నేను వనపతి శిరస్సును ఖండించలేను.

కాపాలికుడు—భైరవిని తలచుకో! అధైర్యపడకు. ఇదివరలో పదిమందిని ఎలాబలివేశావు? ఆవిధంగానే చెయ్యి!

వనపతి—శ్రీ ఆపనిచెయ్యలేదు. ఆఛురికను నాచేతికియ్యండి. నాకంఠాన్ని నేనే నరుకుకో గలను.

కాపాలికుడు—అలాగపనికిరాదు పవిత్రజీవని అయిన కన్యకమాత్రమే భైరవీదేవికీ మహాసేవ చెయ్యడాని కర్హురాలు శ్రీ! వేళ దాటిపోతూండి భైరవి కోపానికి గురికాకు!

శ్రీ—సరే సరే. చేస్తాను. భైరవీదేవికోసం...... భైరవీమాతకోసం ........

వనపతి—(శిరస్సుపై కెత్తి) శ్రీ! ఒక్కముద్దు!

శ్రీకంఠము—(ఛురికతో చటాలున వనపతి కంఠముపై నొకవేటు వేసినది. శిరస్సుతెగి దొర్లిదొర్లి విగ్రహాముచెంత నాగిపోయినది. మొండెము కూలినది.)

కాపాలికుడు—(మంత్రాలుచదువుతూ వనపతి శిరస్సునుదీసి చాచి ఉన్నభైరవీవిగ్రహా హస్తమునసుంచినాడు)

శ్రీకంఠము—(భైరవీవిగ్రహాకరమునందలి వనపతిశిర స్సును తదేకదృష్టితో చూస్తూ) బాబా! బాబా!

కాపాలికుడు—మాట్లాడించకు.

శ్రీకంఠము—చూడు! చూడు! (గట్టిగా ఉన్మత్తురాలివలె కేకలు వేస్తున్నది.)

కాపాలికుడు—ఛీ! (గద్దింపుగా) ఏమి టీ ప్రవర్తన?

శ్రీకంఠము—(వినిపించుకొనక)నవ్వుతున్నాయి... ఆపెదవులు... ఆపెదవులేమంటున్నాయో వింటున్నావా?

కాపాలికుడు—పతితురాలవై పోతున్నావు!

శ్రీకంఠము—ఆపెదవులేమంటున్నాయో విను. ఒక్క ముద్దు... ఒక్కముద్దు... అని జపించుతున్నాయి.

కాపాలికుడు—(క్రుద్ధుడై) పాపిసీ!

శ్రీకంఠము—(చటాలున ముందుకురికి భైరవీవిగ్రహ హస్తమునందలి వనపతి కంఠమును లాగికొని దానివైపు చూస్తూ) వనపతి నావాడు! భైరవికీశిరస్సును దక్కనిస్తానా? ఆరాతిబొమ్మకీశిరస్సును దక్కనిస్తానా? వనపతీ! వనపతీ! ఒక్కముద్దా? కాదు... కాదు... వేయిముద్దులు! (వనపతిఖండితశిరస్సునందలి పెదవులను ఆవేశముతో ముద్దుపెట్టు కొంటున్నది.)

(1936 రచన)



# తార

[ఉజ్జయినిలో తార అనే వేశ్య భవనమున విశాలము సుందరము అయినగది. పడమటివేపు రెండు పెద్దకిటికీలు తెరుచుకుని ఉన్నవి. గనుక బయటి వసంతాకాశములోని సాయంతార ధగధగ మెరుస్తున్నది. దూరాన నీలిఅంచుల పర్వతపంక్తులు, నునుచీకటిలో కనుబడుతూ ఉన్నవి.

గదికి రెండుద్వారాలు. ఒకదాని కెదురుగా ఒకటి తెరలతో మూసుకుని ఉన్నవి. నడుమ మూడుసోఫాలు, రెండు టేబిలులు, ఐదు నిలువుటద్దములు, నేర్పుగా అమర్చబడ్డవి. ఒక మూలను దంతపుస్టాండు ఒకటి దానిమీదను విలువయిన ఎన్నో రకాల పట్టుచీరలున్నవి. సీలింగునుంచి మొగ్గలవంటి దీపాలుగల నీలిరంగు గాజుబుడ్లు గుత్తులు గుత్తులుగ వేలాడుతూ ఉన్నవి. సోఫాలో తార కూర్చుని ఉన్నది. దాసీలు ఆమెకు అలంకరిస్తున్నారు. మాలతి అనే ఆమె, తార జడలో పూలు తురుముతున్నది.]

మాలతి—(పూలు తురుముతూ) ఈపాటికి పుద్యాన వనంలో పచారు చేస్తూవుంటాడు. ఇంకా రాలేదేమా అని తహతహపడతాడు.

తార—(చిర్నవ్వు)

మాలతి—మసక చీకటిలో నువ్వు ఏ పూలపొదమాటు నుంచో తాచుపాములా వెళ్ళి అతన్ని కరుస్తావు. తెలివితప్పి పడి పోతాడు.

తార—అదేమిటి మాలతీ అలాఅంటావు ? నన్ను తాచుపాముతో సరిపోలుస్తావెందుకూ ? నేనంతకర్కోరమయిం దాన్నా ?

మాలతి—కాదు తారా ! పాములా మెల్లగా దొంగ తనంగా పొదమాట్నుంచి వెడతావన్నాను. నిన్నుచూస్తే తెలి వితప్పి పడిపోడామరి ? అందుకని.

తార—తెలివితప్పడమేం ?

మాలతి—ఈ మృదువయిన నల్లనిజడను చూస్తేనే మత్తు కలుగుతుందిగదా, యిహ నీకన్నులు, పెదవులు, ఆవొంటి మెరుగు, వంపులు తిరిగిన పెదవులు, యౌవనపు ఎత్తులు, చూస్తే ఏమవుతుంది ? నీవు నవ్వే చిరునవ్వులు మెరుముల్లా ఎంతో మోహశక్తితో నన్నే చుట్టుకుంటాయే యింక యువ రాజుమాట ఏంచెప్పను ?

తార—(నిలుచుని నిలువుటద్దములో చూసుకొంటూ). మాలతీ ! నిజంగా ఇవ్వాళ ఎంతో అందంగా వున్నానుకాదూ?

మాలతి—నాకు మాటలు రావడంలేదు ఎంతో దిగు లుగా వుంది.

తార—ఎందుకూ ?

మాలతి—ఈ నిమిషంలో నేను మగాడనై పోతే బావుణ్ను. ఆ బ్రహ్మ ఒకగంటసేపు నన్ను మగాణ్ని చేస్తే ఎంత హాయి...

తార!—(నవ్వుతో) చేస్తే...ఇహ నీకవిగారు ఆయ నేంకావాలి? చీకటిపడేసరికి నీమీద రెండువందల విరహగీతా లతో మాలతీ మాలతీ అనుకుంటూ తయారవుతాడే!

మాలతి—ఒకగంట నాకు మగతనంవస్తే యింక నాకే కవీ అవుసరంలేదు. నేనే ఆజన్మాంతం విరహగీతాలు రాస్తాను నీమీద.

తార—నామీదా?

మాలతి—నీమీదకాకుంటే యింకెవరిమీద మరి? తారా నాకిపుడు మగతనంవస్తే నిన్ను వదుల్తానా?...నీపెద వులు నీయౌవనం నాలో కలుపుకోనూ? ఈరాత్రింతా యీసౌ ధాలోనే నిన్ను చెయ్యను? ఆ వుద్యానంలో యువరాజు తహ తహపడుతూ కూచోవలిసిందే కదా!

దాసీ—(వచ్చి) పల్లకీ అవతల సిద్ధంగా వుంది.

మాలతి—సరే వస్తారు వెళ్లు.

దాసీ—(వెళ్ళిపోయింది)

మాలతి—(దంతపుస్తాండు దగ్గరకు వెళ్ళి దానిమీద నున్న జల్తారుమయమయిన ఒక ఉత్తరీయమును తెచ్చి తారకు మేల్మొసుగుగా సవరిస్తూ ఉన్నది)

తార—(కిటికీలోనుంచి బయటకు చూస్తూ) బాగా చీకటిపడింది. చందమామకూడా వుదయిస్తూంది. వెడదామా?

మాలతి—నీలి పర్వతంమాటునుంచి వేడివెన్నెలను కురిసే చందమామను నేను చూస్తున్నాను. ఏమాలతీలత వెనుకనుంచో, చిరునవ్వులతో వచ్చే తారను చూస్తాను యువరాజు.

తార—(నవ్వుతో) ఆకవిగారి కవిత్వం నీకు చాలా బాగా అంటుకుంది. ఇది నిన్నిప్పుడల్లా వదిలేట్టు లేదు.

దాసీ—(వచ్చి) ఎవరో వచ్చారు.

తార—పొమ్మను.

దాసీ—(వెళ్ళిపోయింది)

మాలతి—ఆ వచ్చిందెవరై వుంటారు చెప్మా.

తార—ఎందుకు బెంగపడతావు కవిగారు కాదులే. ఆయనే అయితే దాసీ 'ఎవరో' అని ఎందుకంటుంది? ఇంతకూ ముందుకొన్ని విరహగీతాలు రాందే ఆయనవస్తాడా?

దాసీ—(వచ్చి) వెళ్ళిపొమ్మంటే పోవడం లేదు. తొందరగా చూడాలట.

తార—(విసుగ్గా) గట్టిగా చెప్పలేకపోయినావు. అబ్బ! ఎప్పుడూ ఎవరో వొకరు వేపుకుని తింటారు.

మాలతి—ఆమె యివాళ ఎవర్నీ చూడరని కచ్చితంగా చెప్పు.

దాసీ—ఎంతచెప్పినా వినేట్టులేదు. మనిషి తాగాడో మోగాని వొంటిమీద అట్టే తెలివివున్నట్టూ లేదు.

మాలతి—(ఆలోచిస్తూ) ఎన్నేళ్ళుంటాయి?

దాసీ—ఇరవై వొకటి యిరవైరెండు అంతకన్నా ఎక్కువుండవు.

మాలతి—సరే తెలిసింది! బోడిగుండుకదూ? సన్యాసి?

దాసీ—అవును.

మాలతి—అతనే!

తార—(ఆశ్చర్యముతో) సన్యాసా?

మాలతి—అవును బౌద్ధ సన్యాసి!

తార—బౌద్ధసన్యాసి ఇక్కడికెందుకు?

మాలతి— (పరియాచకంగా నవ్వుతూ) నీకుకూడా సన్యాస మిప్పించి నిన్నుకూడా భిక్షునీని, చేసేందుకు.

తార—హాస్యంకాదు నిజంచెప్పు మాలతీ!

మాలతి—అవునమ్మా నిజమే చెబుతున్నాను వినలేదూ కథలు? ఎందరు రాణులు ఎందరు వేశ్యలు భిక్షునీలుకాలేదు? ఆవేదాంతంవింటే.—

తార—(కన్నులలో భీతితో) నాకు వేదాంతం బోధ చేస్తాడు కామోసు!

మాలతి—వాళ్ళపని అదేగా మరి!

తార—వద్దు! వద్దు !!

మాలతి—వాడెలాగూనిన్ను విడిచిపెట్టడు. ఎప్పుడో ఒకనాడు జీవితము, మరణము, నిర్వాణము మొదలైన, గొప్పమాటలన్నీ ప్రయోగించి పెద్ద వుపన్యాసం ఒకటి నీకు వినిపించి తీరుతాడని నేనానాడే అనుకున్నాను. రోజూ మనం పల్లకీలో వుద్యానానికి వెళ్ళే తోవలోవుండే బౌద్ధవిహారం అక్కడ ఒక స్తంభాని కానుకుని, నిలుచుని పల్లకీలోని నిన్ను తదేకంగా చూపుమేర దాటే వరకూచూస్తాడు. వేశ్యలంతా పాపంలో దిగబడిపోతున్నారని వాడి అభిప్రాయం కామోసు. (బిగ్గరగా నవ్వుతూంది)

తార—(భయంతో) నాకు వేదాంతంవద్దు, జీవితం, మరణం, నిర్వాణం ఏమీవద్దు! నాకాబోడిగుండువాళ్ళంటే భయంవేస్తుంది! పొమ్మను వెంటనేవాణ్ని పొమ్మను! మాలతీ నువ్వుకూడా వెళ్ళు వాణ్ని పంపించెయ్యి వెంటనే—

దాసి—(వెళ్ళబోయి ఆగిపోయింది.)

(విహారి వచ్చినాడు. బౌద్ధ భిక్షువు. వయసు యిరవై రెండు. నున్నని గుండు. చేతులో భిక్షాపాత్ర. చైతన్యమున్నదా అనే సందేహము కలుగుతున్నది అతన్ని చూచేవారికి. వచ్చి తార మొహంలోనికి ఏకాగ్రముగా చూస్తున్నాడు)

తార—(బెదిరిపోయి, భీతిలి, సోఫాలో యిరుక్కుంటూ) ఫో.........ఫో.........,నాకు జీవితంవద్దు, మరణంవద్దు నిర్వాణంవద్దు......

మాలతి —(సోఫాలోపడి విరగబడినవ్వుతున్నది)

దాసి—ఎందుకు నవ్వుతావు ?

మాలతి—ఈ సన్యాసి సంగతి నాకు బాగా తెలుసును. తారకు తెలీదు.

విహారి—(మాట్లాడ లేదు)

తార—నావేపెందుకలా చూస్తావు ? అలా చూడకు ......... వెళ్ళిపో ......... వెళ్ళిపో ............ నాకు వేదాంతం వద్దు......

విహారి—తారా !

తార—(తెప్పరిలి కూర్చున్నది)

మాలతి—పిలుపుబట్టి మనసుకు గ్రహించగలను.

విహారి—తారా !

తార—(భీతిపోగా, హాయిగా, కూర్చుని అతన్ని చూస్తున్నది )

విహారి—తారా ! (ఆమెచెయ్యి పట్టుకున్నాడు)

(అంతా నిశ్శబ్దము) .

విహారి—(ఆమె చేతిని తన హృదయమున ఉంచుకొని ఆమె కన్నుల లోనికిచూస్తూ) ఎంత చక్కనిదానవు !......

తార—(చిరునవ్వు)

దాసి—(నవ్వు ఆపుకోలేక పోతున్నది)

మాలతి—(విరగబడినవ్వుతూ) ఈ వేదాంతంవినగలదు.

తార—ఎవర్నువ్వు? ఎందుకువచ్చావు?

విహారి—ఎందుకా? (భిక్షాపాత్రచూపుతూ) ఇందుకు!

దాసి—(కోపంగా) బిచ్చానికి వచ్చినవాడవు ఆమె చేతులు తాకుతావేం? పో ఎడంగా! మమ్మల్నడగరాదూ? బిచ్చం మేంవెయ్యం? రా అవతలకి!

తార—బిచ్చంవేసి పంపించెయ్యండి! పాపం!

మాలతి—(ఇంకా బిగ్గరగానవ్వుతూన్నది)

విహారి—(ఆమె వేళ్ళను నిమురుతూ)

తారా! ............ ఎన్నడూ ఎవర్నీ యీభిక్షు యాచించలేదు ఇదే తొలిసారి. ఇదే తుదిసారి.............

మాలతి—అతను ఏం కోరుతున్నాడో తెలుసునా? పరిణయభిక్ష (విహారి నుద్దేశించి) ఏమోయి సన్యాసి నీవుకోరే దదేనా?

విహారి—(తార నేచూస్తూ) అవునుతారా అవును.

తార—ఇతనుకూడా కవే..............వాళ్ళు తప్ప, యిటువంటి భిక్షాంన్నింకెవరూ కోరరు.

మాలతి—(వెటకారంగా) ఇన్నాళ్ళు మాకవిగార్ని వెక్కిరించేదానవు ఇక ముందునుంచి ఆయన పూసు ఎలా ఎత్తుతావు?

తార—చాలా ఆలశ్యమయిపోయింది. శాగా చీక టయింది. పల్లకీ సరిచెయ్యమను! పద! మాలతీ! బయలు దేరుదాం-(లేచి నిలుచున్నది)

విహారి—తారా!

తార—నీ పేరేమిటి?

మాలతి—విహారి.

తార—విహారీ! నువ్వు సన్యాసివి. నీతో సాంగత్యం చేస్తే నేనూ సన్యాసినయిపోతాను గనుక వీలులేదు. అలాంటి కోరికలు కోరకు. వెళ్ళిపోయి విహారంలో కూచుని బుద్ధభగ వానుని పార్థించుకో.

మాలతి—నిర్వాణపథంలో పరుగులు వేస్తున్న వాడవు నిష్కారణంగా పాపకూపంలోకి ఎందుకు పడిపోతావు? (వెట కారంగా అన్నది) యువరాజులకుకూడా అందని మా తార,నిరు పేద, కురూపి, అయిన బౌద్ధభిక్షువుకి దొరుకుతుందని ఎలాఅను కున్నావు? ఆకాశంలో మెరిసే తార నీకెంతసులభంగా దొరు కుతుందో యీ తారకూడా అంతే గనక వెళ్ళిపోయి —

విహారి—(నిరాశతో) తారా:

తార—అవును— నువ్వింక వెళ్ళవచ్చును.

విహారి—(కన్నీళ్ళతో) తారా!

[రెండోద్వారంనుంచి వెళ్ళిపోయినాడు]

తార—(చిన్నబోయి) మాలతీ! నేనంత తేలికయి పోయినానా? ఈ సన్యాసులుకూడా నన్ను కోరేటంత నీచ స్థితిలోవున్నానా?

మాలతి—ఇంకా చిన్నవాడు. లోకజ్ఞానం లేనివాడు.

దాసి—(వచ్చి) ఇంకో సన్యాసివచ్చాడు.

తార—అబ్బా!

మాలతి—సన్యాసులమందలన్నీ యీ యింటిమీద పడుతున్నాయే! సరే, రమ్మను.

(ధమ్మపధి వచ్చినాడు. వయసు నలభైనాలుగు, బౌద్ధ భిక్షువు.నున్ననిగుండు.కోపముతో భగభగమండిపోతున్నాడు.)

ధమ్మపధి—(తారను మాలిని చూస్తూ)మీాయిద్దరిలో ఎవరా తారఅనే వేశ్య?

మాలతి—నేను.

తార—నేను.

ధమ్మపధి—(మాలతిని చురచుర చూసి) నాకు తెలియక అడగలేదు. (తారనుచూస్తూ) తారా! నీకీపని ఎంత మాత్రం బాగులేదు.

మాలతి—(సోఫాచూపుతూ) ఇలా దయచేయాండి.

ధమ్మపధి—నువ్వు వేశ్యవు.

మాలతి—(వెక్కిరింపు) తారా! విను సన్యాసిగారేమిటి చెపుతున్నారో! నువ్వు వేశ్యవట. ఎంతకొత్తవిషయం! ఇదిమాత్రం మరచిపోవకుమా ?

ధమ్మపధి—(కోపంగా) పతితురాలవు జీవులను దుఃఖంలోకి లాగివేసే యంత్రానివి. నిర్వాణపధంలో నడిచేవాళ్ళను కూడా హింసించడం మొదలుపెట్టావు. ఇదేమీ బాగులేదు.

మాలతి—మీరు వేదాంతం మొదలుపెట్టినట్లయినా మేమంతా యీభవనం మీకు విడిచిపెట్టి, ఏఅడవుల్లోకో వెళ్ళిపోతాం. తమరెందుకు దయచేశారో ఆవిషయం, కాస్త స్పష్టంగాచెప్తే సావధానంగా వినడానికేమీ అభ్యంతరంలేదు.

ధమ్మపధి—విహారి పరిశుద్ధమైని జీవి. సత్యసాధకుడు. అతనిమనస్సులో నువ్వు పాపబీజాలు వేశావుట. అదిమొదలు అతడు వున్మత్తుడయిపోయినట్లు రాత్రింబవళ్ళు నీయింటిముందునుంచితిరుగుతూ సాయంత్రం పల్లకీలోవెళ్ళిపోయేనిన్ను చూస్తూవున్నాడట. ఇందాకను, నీయింటో ప్రవేశించాడని తెలిసింది. అత నేడీ? నీపాపమయమయిన దేహాన్ని స్పృశించాడా అధోలోకాల్లోనికి పడిపోయాడన్నమాటే! అతన్నెక్కడుంచావు?

తార—(కోపంగా) అతన్నా?...అతన్నా? మేడమీద...మూడో అంతస్తులో నాపడకగదులో—

మాలతి—మీవిహారి ఏమీకష్టపడిపోతూండడం లేదులెండి. హాయిగా ఆపడకగదులో తారకోసం ఎదురుచూస్తూపచారుచేస్తున్నాడు. ఈమె యిక్కడ అలంకరించుకుంటూంది.

ధమ్మపధి—(సోఫాలో చప్పున కూచుని ఆలోచనలో మునిగి) పడకగదులోనా?

మాలతి—అవును.

ధమ్మపధి—(తారనుచూస్తూ) తారా!

తార—(చిర్నవ్వుతో) ఎందుకు.

ధమ్మపధి—(క్షణమాలోచించి) ఒకవిషయమై నీతో ఏకాంతంగా మాటాడి వెళ్ళిపోతాను.

[మాలతీ, దాసీలు వెళ్ళిపోయినారు]

తార—(అతనికి కొంచెం దగ్గరగావచ్చినిలుచున్నది)

ధమ్మపధి—విహారి ఎక్కడున్నాడు?

తార—నా పడకగదులో.

ధమ్మపధి—విహారి రూపసికాడు, ధనవంతుడుకాడు భిక్షువుకదా...

తార—అవును.

ధమ్మపధి—మరి నువ్వు ఎంతో చక్కనైనదానవు. ధనవంతురాలవు. అత న్నెలా అంగీకరించావు?

తార—(చిరునవ్వుతో) ఆసంగతులు మీవంటి సన్యాసులకు తెలీవు. మాకూ విహారివంటి పడుచువాళ్ళకు మాత్రం తెలుసు.

ధమ్మపధి—(నిదానంగా) తారా!

తార—ఏమో సంశయిస్తున్నారు.

ధమ్మపధి—నీకెన్నేళ్ళో అడగవచ్చునా ?

తార—ఇరవై నాలుగు.

ధమ్మపధి—విహారికి యిర్వైవె. నీకంటె నాలుగేళ్ళు చిన్న.

తార—చిన్నవాడేగాని మీ విహారి ఎంత చురుకైనవాడనుకున్నారు. సన్యాసులలో కూడా యింత నేర్పు వుంటుందా అనుకున్నాను.

ధమ్మపధి—(ఆమెకళ్ళలోనికి చూస్తూ) ఎంతచక్కనైనదానవు తారా నువ్వు.

తార—జీవులను దుఃఖంలోనికి లాగివేసే యంత్రాన్ని కదా నేను.

ధమ్మపధి—కాదు ! నీకన్నులు పక్షుల్లా నాభుజాలమీద వాలుతున్నాయి.

తార—(చిర్నవ్వు) అట్లనా ?

ధమ్మపధి—నేను బౌద్ధవిహార అధికారిని. ఎంతో ధనం వుంది. గాని కురూపీ, నిరుపేదా, అయిన విహారికంటే ఎన్నోరెట్లు కిందితరగతిలో వున్నాను.

తార—ఎంచాత ?

ధమ్మపధి—ఎంచాతో నీకు తెలీదూ ? అతన్ని నువ్వంగీకరించావు. ఎంత ఆనందంవుంది ఆచూపుల్లో, ఆచిర్న

పూవ్వుల్లో. నువ్వు నవ్వుతున్నపుడు... తారా.........నన్ను నెరెరి త్రించకు...ఆమె తనివత్తానికి నన్నదుముకో......

మాలతి—(వచ్చి) విహారి తొందరపడుతున్నాడు.

తార—(ఆత్రుతతో) ఇదిగో ఇదిగో వచ్చేస్తున్నా! ఎంతఆలశ్యంచేశాను పాపం యింతసేపూ వొంటరిగా నాకోస మని కూర్చున్నాడు. (నిలువుటద్దంలో చూసుకొంటూ ధర్మ పథితో) మీరు వెళ్ళవచ్చును.

ధర్మపథి—(చప్పున లేచి కోపంగా అడుగులు బరు వుగా వేస్తూ వెళ్ళిపోయినాడు.)

మాలతి—బాగామోసపోయినాడు! ఎంత ఈర్ష్య! విహారంలో విహారీ, యీముసలాయనా, యిద్దరూ కలుసుకుం టారు. ఒకర్నొకరు పట్టుకొని ఏడుస్తారేమో!

తార—(చిరాకుగా) అబ్బా! తలంతాతిరిగిపోతూంది, యీసన్యాసుల గోలతో. ఇవాళ వుద్యానానికి రాను! ఒక గంట వొక్కతనూ కూచుంటేనేగాని యీ చిరాకు పోదు.

మాలతి—(వెళ్ళిపోయింది.)

(గదులో తార ఒక్కతా మిగిలినది. కిటికీలోనుంచి బయటిఆకాశంలోని చుక్కలూ, చందమామా కనబడుతున్నవి. సన్నని వెన్నెల గదులోనికి పడుతున్నది. గాలి రిచటలు వేస్తు న్నవి. తార సోఫాలో నిమీలితంగా కన్నులుంచి సగంగా

అయిదునిమిషాలు పండుకొన్నది. నిలువుటద్దంవెనకనుంచివచ్చి ఆమెవెనుక నిలుచున్నాడు విహారి.)

విహారి—తారా!

తార—మళ్ళావచ్చావా ?

విహారి—అసలు నేను వెళ్ళిపోనేలేదు. ఈ నిలువుటద్దం వెనక నుంచున్నాను. తారా! నామీద కోపమా ?

తార—(చిరునవ్వుతో) ఇలా రా! నీపేరు విహారి కాదూ ?

విహారి—అవును తారా నాపేరు విహారి. (వంగి తార నుదురు ముద్దుపెట్టుకున్నాడు.) (1936 రచన)



# భద్రకాళి.

[వెన్నెలరాత్రి. ఆరావళీ పర్వతాల కనుమల్లో ఒక కుటీరం ముందు దాశరథి ఏకతారపైన పాడుతున్నాడు. అతని చుట్టూ పర్వతవాసులు కూచుని పాట వింటున్నారు. ఎదట వెన్నెల్లో చెట్లనీడలు కదులుతున్నవి. కుటీరంచుట్టూ జాగిలం కుక్కలు పహరా కాస్తున్నవి.

దాశరథీ ఉమాపతీ గాయకులు. పర్వతనివాసులు. తమ జాతిలో ఉత్తేజాన్నీ, ఉద్రేకాన్నీ కలిగించడానికి సంగీతాన్ని సాధనంగా చేసుకున్నవారు. వీరంటే పార్వతీయులకు అమిత గౌరవం. దాశరథీ, ఉమాపతీ అన్నదమ్ములు. దాశరథివయస్సు ముప్పై రెండు; ఉమాపతి నాలుగేళ్ళు చిన్న. దాశరథి మంచి బలిష్టుడు. ఉమాపతి సన్నగా, పొడుగ్గా ఉంటాడు. దాశరథి కళ్ళు గుండ్రంగా ఉంటవి. ఉమాపతికళ్ళు సోగగా ఉంటవి. ఏకతారవాద్యంలో ఉమాపతికంటె దాశరథికి ప్రతిభ ఎక్కువ. గాత్రమాధుర్యంలో ఉమాపతి అన్నకంటె మిన్న.

ఈ రాత్రి వెన్నెల మహాచక్కగా ఉన్నది కనుక వేటకు జాగిలాలను వెంటపెట్టుకుని నిబిడారణ్యాలలోకి వెళ్లిపోయి

నాడు ఉమాపతి. అంచాత దాశరథి ఒంటరిగా పార్వతీయులకు సంగీతం విన్పించవలసి వచ్చింది.

దాశరథిపాట ముగిసింది.]

పార్వతీయులు—దాశరథీ! దాశరథీ! ఇంకోపాట!

దాశరథి—మరి పాడలేను.

పార్వతీయుల్లోని ఒక వృద్ధుడు—నిద్రవస్తూందా?

మరొకడు—అలిసిపోయినావా?

దాశరథి—కాదు. ఇంకా ఉమాపతి ఎంచాత రాలేదా అని దిగులు వేస్తూంది.

వృద్ధుడు—నీ తమ్ముడికేమీ భయంలేదు.

ఇంకొకడు—ఈటెలు తీసుకువెళ్ళాడు. జాగిలాలను వెంట పెట్టుకున్నాడు. ప్రమాద మేముంటుంది?

దాశరథి—అదికాదు. నేనోసారి వెళ్లివస్తాను.

వృద్ధుడు—(నవ్వి) వెర్రితండ్రీ! ఎందుకోయ్ దిగులు? ఇంకోక్షణంలో ఉమాపతి రాకుంటే అంతా వెళదాము. ఏదీ ఒక చిన్నపాట! కానియ్యి.

దాశరథి—(దిగులుగా ఏకతారను తీసి వాయించుతున్నాడు).

వృద్ధుడు—పాట నడవకండావుంది. మనస్సంతా తమ్ముడిమీద వుంది.

దాశరధి—(కన్నీటితో) తాతా ! నీకు తెలీను. ఉమా పతిని గురించి నాకున్న బాధ్యత, మా నాయన చనిపోతూ చని పోతూ ఉమాపతిని నా చేతుల్లో వుంచాడు. 'వీణ్ణి పెంచేభా రంనీది' అని నాకు వప్పగించాడు. నేను ఉమాపతికంటె నాలు గుఏళ్లే పెద్దకాని ఉమాపతికి నేనే తండ్రిని, తల్లిని. వాడికి యిం కెవరూ లేరు. (కన్నీరు తుడుచుకుంటూ) వాడు ఏ పులిబారి నయినా పడిపోతే వాడికోసమని ఏడ్చేటందుకు నేనుతప్ప యింకెవరూ—

వృద్ధుడు—అవ్వుగో జాగిలాల మొరుగులు !!

దాశరధి—(దిగ్గున లేచి ముందుకు నడుస్తూ) భగవం తుడా బ్రతికించావ్ !

(ముందు జాగిలాలూ, వెనకను చచ్చిన చిరుతపులులను బుజాన వేసుకొని నెత్తురుతో తడిసిన శరీరంతో చేత యీటె లతో ఉమాపతీ, అతనివెనక భద్రకాళీ వస్తున్నారు. భద్రకాళి సన్నగా, పొడుగ్గా ఉన్నది. చామనచాయశరీరం. మెరుపుల విడిచే కన్నులు. జుట్టు విరియబోసుకొన్నది. వయస్సు యిరవై నాలుగు).

దాశరధి—(కన్నీటితో, గద్గదికతో తమ్ముని కౌగలిం చుకుని) వచ్చావా ఉమాపతీ ! ఇంత రాత్రిచేశావేం ? చంద మామ అస్తమించబోతూంది. చుక్కలన్నీ ఆరిపోతున్నాయ్. నీకోసమని ఎంత బెంగపెట్టుకున్నాన్రా నాయనా !

ఉమాపతి—బొ గెండు కన్నా ! రెండు చిరుతల్ని కూలనేశా. ఇదుగో అన్నో ! ఎవర్ని తెచ్చానో చూశావ్ ! (భద్రకాళిని చూపిస్తూ పకాపక నవ్వుతున్నాడు.)

వృద్ధుడు—ఎవరబ్బా యీ నెమిలి ?

పార్వతీయులు—ఉమాపతి కోడల్ని తెచ్చుకున్నాడోయ్ !

దాశరధి—ఇదెవర్రా యీ లేడి ?

ఉమాపతి—దాన్నే అడుగు. చెబుతుంది.

దాశరధి—నీ పేరు ?

భద్రకాళి—భద్రకాళి !

దాశరధి—నీ వూరు !

భద్రకాళి—చాలాదూరం !

దాశరధి—నీ నాయన ?

భద్రకాళి—(ఆకాశంచూపి) అక్కడున్నాడు.

దాశరధి—నీయమ్మ ?

భద్రకాళి—ఆమె అక్కడికే వెళ్లింది.

దాశరధి—నీ కెవరున్నారు ?

భద్రకాళి—ఉమాపతి !

పార్వతీయులు—(పకాపకనవ్వుతూ) ఇది ఉమాపతికోడలేనర్రోయ్.

ఉమాపతి—నీ కెవరున్నారు భద్రకాళీ !

భద్రకాళి—(నవ్వుతూ) నవ్వూ !

దాశరధి—ఇది ఎక్కడదొరికింది ఉమాపతీ !

ఉమాపతి—రాళ్ల కోనేరు దగ్గర తుప్పల్లో యీ చచ్చిన చిరుతను నేను వెంటాడుతున్నాను. చిరుత ముందు పారిపో తూంది. ఒక తుప్పలో బంగారంలాగ మెరిసిందన్నా. చిరుతే అనుకుని యీ ఈటతో పొడవబోయినా. చూతునుగదా భద్ర కాళి. ఇది తనపేరు నాకు చెప్పింది; నా పేరు దీనికి చెప్పా. నాతో వస్తానంది; రమ్మన్నా.

దాశరధి—ఇంట్లోకి రండి.

(దాశరధీ, ఉమాపతీ, భద్రకాళీ కుటీరంలోకి వెళ్ళారు. పార్వతీయులు అరుస్తూ చప్పట్లు చరుస్తూ నవ్వుకుంటూ వెళ్లి పోతున్నారు.)

[మర్నాటి ఉదయం. కుటీరంలో ఒకగదిలో వెదురు మంచంపైన గొంగళి కప్పుకొని భద్రకాళి నిద్రపోతున్నది. కిటికీలోనుంచి నీరెండ ఆమెముఖంపైన పడుతున్నది. ఉమా పతి నవ్వుముఖంతో ఆమెదగ్గరకు వచ్చి ఏకతార వాయించడం ప్రారంభించాడు. ఆ ధ్వనికి ఆమె దిగ్గనలేచి వచ్చి ఉమాపతి మెడచుట్టూ చేతులు పెనవేసింది]

భద్రకాళి—నువ్వెంతబాగా పాడతావ్ ఉమాపతీ ?

ఉమాపతి—నే నిప్పుడు పాడలేదుగదా కాళీ!

భద్రకాళి—రాత్రల్లా నామంచంప్రక్కను కూచుని నువ్వు మెల్లగా పాడలేదూ?

ఉమాపతి—నువ్వు నిద్రపోయినావనుకొని పాడానే!

భద్రకాళి—కలలోనే నీ పాటలన్నీ విన్నానో ఉమాపతీ!

ఉమాపతి—లేదు, నీదంతా దొంగనిద్ర. కొంటెపిల్లా!

భద్రకాళి—ఉమాపతీ! ఏకతార వాయించవూ?

ఉమాపతి—నాకంటె మా అన్న బాగా ఏకతార మీటగలడు!

భద్రకాళి—మీ అన్న కళ్లుచూస్తే నాకు భయమవుతుంది.

ఉమాపతి—మరి నాకళ్లు?

భద్రకాళి—అవి నీలిపిట్టలు!

ఉమాపతి—వెర్రికాళీ! అన్న ఎంత మంచివాడనుకున్నావ్!

(ద్వారందగ్గర దాశరధి గంభీరంగా నిలుచున్నాడు. భద్రకాళి. ఉమాపతిమెడను చుట్టిన చేతుల్ని తీసివేసింది.)

దాశరధి—ఉమా!

ఉమాపతి—అన్నా!

దాశరధి—(కర్కశ స్వరంతో) కొండకోనకు పోయి తేనెపట్లు తీసుకురా, వెళ్ళు.

భద్రకాళి—(దాశరధితో) నువ్వు వెళ్ళరాదా ?

దాశరధి—ఏమి ఉమా ! మాటాడవ్ ?

ఉమాపతి—వెడుతున్నా నిదిగో !

భద్రకాళి—(ఉమాపతితో) నేనూ నీతో వస్తాను.

దాశరధి—నువ్వుపోవద్దు.

భద్రకాళి—కాదు, పోతాను.

దాశరధి—నువ్వు పోడానికి వీల్లేదు.

ఉమాపతి—పోనీ రానీ అన్నా ! కొండలూ, లోయలూ చూస్తుంది.

దాశరధి—నువ్వు జాగుచేస్తున్నావ్ !

ఉమాపతి—ఉండు కాళీ ! అన్న ఏకతార విన్పిస్తాడు. నాకంటె బాగా పాడతాడు (వెళ్ళిపోయినాడు.)

దాశరధి—నేనంటే ఎందుకు నీకింత భయం ?

భద్రకాళి—నాకు నువ్వంటే భయం లేదే !

దాశరధి—ఇందాక ఉమాపతితో అన్లేదూ ?

భద్రకాళి—(గుటకలుమింగుతూ) నా కెవరిదగ్గిరా భయంలేదు.

దాశరధి—నిజం ! ఎవరిదగ్గరా ? నాదగ్గరా ?

భద్రకాళి—కాని ఆయముడిదగ్గిర మాత్రం—

దాశరథి—ఎవడు వాడు?

భద్రకాళి—అదంతా మరిచిపోయినా.

దాశరథి—వా డేంచేశాడు?

భద్రకాళి—మానాన్నను మింగేశాడు. ఓ—అదంతా మరిచిపోయినా. మరేమీ నన్నడగకు.

దాశరథి—(ఆమె బుజంమీద చెయ్యి వేసి) పిరికిపిల్లా! ఇంకేమీ అడగనులే. నీకు సంగీత మిష్టమేనా?

భద్రకాళి—చాలా!

దాశరథి—ఉమాపతిపాటలు నచ్చాయా?

భద్రకాళి—అవి మాత్రమే నచ్చాయ్.

దాశరథి—మరి నాపాటలు వింటావా?

భద్రకాళి—ను వల్లా నావంకచూడకు!

దాశరథి—చూస్తే?

భద్రకాళి—నాకు భయమేస్తుంది.

దాశరథి—సరిలే. కళ్ళు మూసుకునే పాడతా. వింటావుగదూ!

భద్రకాళి—వింటాను.

(దాశరథి ఏకతార తీసి తీగెలు మీటుతున్నాడు. కుటీరంఅవతలనుంచి పురుషకంఠం "ఎవరు లోపల?" అని విన్పడింది! భద్రకాళి ఆస్వరం విని నిలువునా గడగడ వడకిపోతున్నది.)

భద్రకాళి——వాడే ! వాడే ! అయ్యయ్యో ! దాశరథి ! రక్షించు (అతనిచేతులు పట్టుకున్నది.) నన్నూ మింగేస్తాడు. నాన్నను... అమ్మను... ఓ-వాడివంక చూడలేను. దాశరథీ, రక్షించు.

దాశరథి——భయపడకు. నువ్వవతలగదిలోకి పద !

(ఆమెను ఆగదిలోనుంచి యింకోగదిలో విడిచిపెట్టి ఒంటరిగా తాను యిక్కడికి వచ్చాడు. కుటీరంబయటనుంచి "పలకరేం ? ఎవరు లోపల ?" అని ఎవరో పిలుస్తున్నారు. కర్కశస్వరంతో "ఎవరది ? లోపలకు రావచ్చును" అన్నాడు దాశరథి ఒక ఆశ్వికుడు లోపలకు వచ్చాడు.)

దాశరథి——ఎవరు మీరు ?

ఆశ్వికుడు——సముద్రగుప్తుడు పంపగా వచ్చాము.

దాశరథి——ఎందుకు ?

ఆశ్వికుడు——ఒక అమ్మాయి నిన్నరాత్రి యిక్కడకు వచ్చిందట.

దాశరథి——ఎవరు ?

ఆశ్వికుడు——అమ్మాయి. చామనచాయగా సన్నగా పొడుగ్గా——

దాశరథి——(నవ్వి) ఓహో ! అమ్మాయిలతో మాకేం పని ? నేనూ మా ఉమాపతీ యిద్దరమూ బ్రహ్మచారులం. ఆజన్మ బ్రహ్మచారులం... యీసంగతి అందరికీ తెలుసు.

ఆశ్వికుడు—కాని మాచారుడు యీవార్త తెచ్చాడు.

దాశరథి—అబద్ధం !

ఆశ్వికుడు—పార్వతీయులు కొందరుకూడా వొప్పు కున్నారు.

దాశరథి—ఆ అమ్మాయా ? పేరు భద్రకాళి కాదూ?

ఆశ్వికుడు—(ఆత్రంతో) అవునవును. ఆ అమ్మాయె.

దాశరథి—నిన్నరాత్రి యిక్కడికి వచ్చిన పిల్ల-

ఆశ్వికుడు—అవును, నిన్ననే వచ్చిందట.

దాశరథి—అయ్యో మీ రెంతజాగుచేశారు. వేకువనే అరణ్యాల్లోకి వెళ్ళిపోయింది. తన్నెవరో వెన్నాడుతున్నారట.

ఆశ్వికుడు—అవునవును మా సరపతే వెన్నాడుతున్నారు. వెళ్ళిపోయిందా ?

దాశరథి—వెళ్ళిపోయింది.

ఆశ్వికుడు—ఈ యింట్లో లేదా ?

దాశరథి—అనుమానంవుంటే యిల్లంతా చూడండి. కాని ఆ పిల్ల వేకువనే వెళ్ళిపోయింది.

ఆశ్వికుడు—సరే.

(వెళ్లిపోయినాడు—అవతలనుంచి గుర్రం పరుగెత్తిపోతున్న ధ్వని)

దాశరథి—ఓ భద్రకాళీ ! ఇంక రా !

భద్రకాళి—(వస్తూ, సంశయంతో) వెళ్లిపోయినాడా?

దాశరథి—పంపించివేశాను.

భద్రకాళి—(వచ్చి అతనిచేతులు పట్టుకుని) నువ్వెంత మంచివాడివి!

దాశరథి—నీ కోసమని అబద్ధంకూడా ఆడవలసివచ్చింది

భద్రకాళి—నన్ను రక్షించావ్‌గదా!

దాశరథి—(ఆమెబుజాలపైన చేతులువేసి) నే నంటే భయం పోయిందా?

[ద్వారందగ్గరకు ఉమాపతి వచ్చాడు]

ఉమాపతి—కాళీ!

భద్రకాళి—(పరుగుపరుగున వెళ్ళి ఉమాపతిమెడ కౌగలించుకొని) నేను బ్రతికివున్నాను ఉమాపతీ! నిన్ను చూడడానికింకా బ్రదికివున్నాను. (కన్నీరు)

ఉమాపతి—(ఆమెకన్నీరు తుడుస్తూ) ఎవరది? గుఱ్ఱంపైన నిన్ను వెదక్కుంటూ వచ్చాడట!

భద్రకాళి—యమదూత!... వాడే... వాడే... వాణ్ణే పంపించాడు.

దాశరథి—ఉమా!

ఉమాపతి—అన్నా!

దాశరథి—కొండకోనకు పోలేదూ?

ఉమాపతి—లే దన్నా!

దాశరథి—ఎంచాత?

ఉమాపతి—భద్రకాళికోసమని ఎవడో గుర్రంపైన-

దాశరథి—నామాట నువ్వు పాటించలేదు—

ఉమాపతి—కాళి.........

దాశరథి—నిన్న వచ్చిన యీ కాళి నీకు నాకంటె ఎక్కువయింది.

ఉమాపతి—కాదన్నా !—

దాశరథి—నిన్నింతవాణ్ణి చేసిం దెవరో అప్పుడే మరిచావే !

ఉమాపతి—అయ్యో! అది కాదన్నా! నామాట విను-

దాశరథి—చనిపోతూ నాన్న నిన్ను నాకు వప్పగించాడు.

ఉమాపతి—నాటినుంచి నువ్వే నాకు నాన్నవి. కాని నే ననేది—

దాశరథి—నువ్వు నామాట దాటావు !

ఉమాపతి—ఎన్నడూ నేను జవదాటనన్నా. ఏంజరిగిందంటే—

దాశరథి—జవ దాటవా ? (చేయిజాచి) చేతులో చెయ్యి వెయ్యి.

ఉమాపతి—(అన్న చేతిలో చేయివేసి) ఎన్నడూ జవదాటను—

దాశరధి—అయితే యింక నువ్వు భద్రకాళితో మా
టాడకు.

ఉమాపతి—(ఆశ్చర్యంతో) ఏమిటీ?

భద్రకాళి—ఏమిటీ ?

దాశరధి—భద్రకాళితో నువ్వింక మాటాడకు !

భద్రకాళి—నే నేం చేశాను ? నామీద నెందుకు నీకం
కోపం దాశరధీ !

ఉమాపతి—ఎన్నాళ్లు ?

దాశరధి—ఎన్నడూ ను వ్వామెతో మాటాడరాదు.

ఉమాపతి—ఎన్నడూనా ?

దాశరధి—ఎన్నడూ ?

ఉమాపతి—ఈ జీవితంలో-?

దాశరధి—ఆమరణాంతం.

ఉమాపతి—చనిపోయేటప్పుడూ ?

దాశరధి—అప్పుడయినా మాటాడరాదు.

ఉమాపతి—ఒక్కసారి ?

దాశరధి—కూడదు.

ఉమాపతి—కడసారి ?

దాశరధి—కూడదు.

ఉమాపతి—నా తరమా ?

దాశరధి—ప్రమాణం చేశావ్ !

ఉమాపతి—సరే !

దాశరథి—అంటే !

ఉమాపతి—మాట్లాడను (వెళ్లిపోతున్నాడు)

భద్రకాళి—(అతని చేతులు పట్టుకుని) ఉమాపతీ !

[ఉమాపతి "ఎందుకు" అన్నట్టుగా చూశాడు]

భద్రకాళి—నే నేం చేశాను ? నాతో ఎందుకు మాటాడవు ?

ఉమాపతి—(విషాదహాసం)

భద్రకాళి—ఉమా ! ఇదుగో—

ఉమాపతి—(వెళ్లిపోతున్నాడు)

దాశరథి—(మొరటుగా భద్రకాళి చేయి పట్టుకునిలాగి) ఇటు తిరుగు ! వా డింక నీతో మాట్లాడడు.

భద్రకాళి—(కన్నీళ్లతో) దాశరథీ! దాశరథీ ! ఎందుకు నామీద నీ కింత పగ ?

(ఆరాత్రి, ఆగదిలో, ఒకమూలను ఆముదదీపం వెలుగుతున్నది. కిటికీలోనుంచి మబ్బుగమ్మిన ఆకాశం కనబడుతున్నది. కిటికీదగ్గర ఉమాపతి నిలుచుని బయటికిచూస్తున్నాడు. భద్రకాళి వచ్చి దగ్గరగా నిలబడ్డది.)

భద్రకాళి—ఉమా ! మబ్బులవంక చూస్తున్నావా ?

ఉమాపతి—(తల యిటుత్రిప్పాడు)

భద్రకాళి—ఉమా ! అడవుల్లో నన్ను వదలిపెట్టలేక పోయినావా ? నన్నెందు కిక్కడికి తెచ్చావ్ ?

ఉమాపతి—(ఇటు తిరిగాడు)

భద్రకాళి—ఒక్కమాట నాతో మాటాడగూడదా ?

ఉమాపతి—(తల వ్రూపాడు)

భద్రకాళి—(అతని బుజాలమీద చేతులువేసి) నే నేం చేశాను ? నామీద ఎందుకు కోపం ?

(దాశరథి వచ్చాడు.) అతనికళ్లు ధగధగ మెరుస్తున్నవి. చేతులో యీాటె ఉన్నది.)

దాశరథి—(కఠోరస్వరంతో) ఉమాపతీ !

ఉమాపతి—అన్నా !

దాశరథి—ఏంచేస్తున్నావు ?

ఉమాపతి—మబ్బులు చూస్తున్నాను.

దాశరథి—అసత్యవాదీ !

ఉమాపతి—నేను కాళితో మాటాడలేదు.

భద్రకాళి—లేదు. లేదు. నాతో ఉమాపతి మాటాడ లేదు. దాశరథీ ! ఎందుకు నా కీశిక్ష ? నే నేంనేరం చేశానని ?

దాశరథి—ఇటు రా ఉమా.

ఉమాపతి—(వచ్చి) ఎందు కన్నా !

దాశరథి—(అతని ముంజేయి పట్టుకొని కదుపుతూ) నువ్వు కాళిముఖం చూడ నని బాస చెయ్యి.

ఉమాపతి—ఎందుకు ?

దాశరధి—(నిట్టూర్చి) అది నే సహించలేను.

ఉమాపతి— నేను బాసచెయ్యాను !

దాశరధి—మరచిపోయినావా ? నిన్ను నేనేకదా పెంచాను.

ఉమాపతి—మరిచిపోలేదు. కాని కాళిని చూడకుండా వుండడం నాతరం కాదు.

భద్రకాళి—(వెక్కి వెక్కి ఏడుస్తున్నది)

దాశరధి—భద్రకాళి చేయి పట్టుకుని దగ్గరకుతీసుకొని) కృతఘ్నుడా ! ఇది నీ కెన్నడూ దక్కదు.

భద్రకాళి—ఉమాపతీ ! ఉమాపతీ !

ఉమాపతి—(భద్రకాళి చేయిపట్టుకొని)ఆమెను విడిచి పెట్టు.

దాశరధి—ఈ యీటె నెందుకు తెచ్చానో యెరుగుదువా ?

భద్రకాళి—ఆ యీటెను నాగుండెలో గ్రుచ్చు.

దాశరధి—కాదు, దాన్ని ఉమాపతిగుండులో పొడుస్తాను.

ఉమాపతి—(ఇంకొక యీటె తీసి) వదులు కాళిని. ఇంక నేను సహించేది లేదు.

(ఉమాపతీ, దాశరధీ యీ‌ాలెలను సంఘర్షణచేసి ఒకరి నొకరు పొడుచుకోపోతున్నారు. భద్రకాళి ఒక్క కేకపెట్టింది.

ఈసమయంలో కుటీరంబయట గుర్రాలునిలచినశబ్దం. ఉమాపతీ, దాశరధీ ఆశ్చర్యంతో నిశ్చలులై నిలచిపోయినారు)

భద్రకాళీ—(ఆనందంతో) వచ్చాడు ! వచ్చాడు !! వచ్చాడు !!!

ఉమాపతి—ఎవరు కాళీ ?

దాశరధి—ఎవ రా వచ్చింది ?

భద్రకాళి—వాడే! వాడే! నన్నుకూడా మింగేయడానికి.

దాశరధి—లోపలిగదిలోకి వెళ్ళి దాక్కో.

భద్రకాళి—నేను దాగోను.

ఉమాపతి—నామాటవిను కాళీ ! పద పద. లోపలిగదిలో దాక్కో.

భద్రకాళి—నేనుదాగోను. ఆ యముడ నోట్లో పడతాను.

(పాదరక్షలధ్వని అవతలనుంచి వినబడుతున్నది.)

దాశరధి—(ఆత్రంతో) కాళీ ! నిన్ను బతిమాలుకుంటాను. పద, గదిలో దాక్కో.

ఉమాపతి—నీతో మాటాడుతున్నానుగానూ ! నా మాట వినవ్ !

భద్రకాళి—వినను ! వినను !

(సముద్రగుప్తుడు వచ్చి భద్రకాళిని చూసి నవ్వాడు.)

సముద్రగుప్తుడు—ఎక్కడకు పారిపోగలవ్ భద్రకాళీ! నీకోసమనికదా యీ ప్రయాస. (ఆమె చెయ్యిపట్టుకుని) ఇంకెక్కడకు పారిపోగలవ్ !

భద్రకాళి—నే నెక్కడకూ యింకపారిపోను పద, నీతో నే వస్తాను

భద్రకాళీ సముద్రగుప్తుడు వెళ్ళిపోయినారు. బయట గుర్రాలు పరిగెత్తిపోతున్న ధ్వని. ఉమాపతీ దాశరథీ నిశ్చేష్టులై నించున్నారు. కొన్నిక్షణాలు గడిచినవి.

నేలనుపడిఉన్న ఏకతారలను దాశరథి తీసి మౌనంగా ఒకటి ఉమాపతికి అందిచ్చాడు. ఒకటి తాను పట్టుకున్నాడు)

ఉమాపతి—భద్రకాళి పోయింది.

దాశరథి—ఏకతార మిగిలింది.

(ఇద్దరూ ఏకతార వాయిస్తున్నారు. అవతల వానచప్పుడులో ఏకతార మందధ్వని కలిసిపోయింది.) (1939 రచన)



# సుజాత.

ఉద్యానములో మన్మథ దేవాలయము ఉన్నది. అత్యున్నతములైన శిఖరాలు తెల్లగా మెరసిపోతున్నవి. సుందరమైన శిల్పముగల స్తంభాలు ప్రేక్షణీయములు. సోపానములు పొడవుగానూ విశాలముగానూ పాలకాంతివగుట చేతను ముకురముల వలె ఉన్నవి.

పచ్చికపెరిగిన నేల చూపుమేర దూరమువరకు పరచిన ఆకుపచ్చ మొహాములు తివాసీవలె కనబడుతున్నది. అక్కడక్కడ పూలపొదలు, పొగవంటి ఆకులగుంపులుగల పొడుగుపాటి చెట్లూ ద్రాక్షలతలూ గలవు. పొదలుపొదలుగా ఉన్న వెదురుకన్నాలలో జొరబడిన సోమరిగాలి 'రింవ్ రింవ్' మని మధురగానము చేస్తున్నది.

రాత్రి తొమ్మిదిదాటినది. ఆకాశమునిండా నక్షత్రాలూ దశమిచందమామా ఉన్నవి. తెల్లని జారువెన్నెలలో వృక్షాలూ ఆలయ స్తంభాలూ నల్లని నీడలను వేస్తున్నవి.

ఆలయసోపానముపై పద్మాసనములో కూర్చున్నాడు ఒక విరాగి. సగము మాత్రము విడిన అతని కనులబట్టి, ధ్యాననిమగ్నుడని చెప్పవచ్చును. వయసు ఇరవైఐదు. చామనచాయ శరీరము, రింగులురింగులు తిరిగి బుజాలమీద పడుతున్న జుట్టు,

కలువరేకులవలె కొనలో వంపు తిరిగిన కనులు, సన్నని పెదవులు అతను రూపరి అని చెబుతున్నవి. కాషాయవస్త్రములు ధరించినాడు.

ఒకచేత పూజాద్రవ్యములు గల వెండిపళ్లెరముతో రెండవచేత పూలమాలికలతో నిండిన సజ్జాతో సుజాత వస్తున్నది. నీలాకాశమునుండి ఒకనక్షత్రము చటుకున తెగి నేలకు జారిపోయినది. ఆమె సోపానము సమీపించి వంచినతలను కొంచమెత్తి విరాగినిచూచి మరల తలవంచుకొని సోపానము లధిరోహించి ఆలయములో ప్రవేశించినది.

ఆమెవయసు పద్దెనిమిది పందొమ్మిది ఉండవచ్చును. ఒక తెల్లకలువవలె మనోమోహముగా కనబడుతున్నది.

కొన్ని నిముషములు గడచినవి సుజాత ఆలయములో నుండి బయటకు వచ్చినది. ఈసారి ఆమె పూలసజ్జాను మాత్రమే పట్టుకొన్నది. సోపానములు దిగుతున్నది. ఆమె కాలి బంగరు గజ్జలు పావురముల అరుపులవలె ఘల్లుఘల్లు మన్నవి.

విరాగి—(కనులు తెరచినాడు)

సుజాత—(తలవంచి నమస్కరించినది)

విరాగి—బంగరు గంటల్లాగ వినిపించింది. వాళ్ళే అనుకున్నాను. ఈరాత్రి తప్పదు!...తప్పకుండా దిగుతారు...దిగితీరుతారు (పైకి ఆకాశమువేపుచూసి) గగనంనుంచి వాళ్లు దిగుతున్నపుడు తారకలు బంగరుగంటల్లాగ గణగణమని నవ్వ

తాయి వెలుగుధారల్లో కాళ్ళు మెరుపుతీగల్లాగ కదిలిపోతూ దిగుతారు.

సుజాత—ఎవరు స్వామీ ?

విరాగి—(ఇంతవరకును తనలోతాను తన్మయుడై పైకి పై మాటలను అంటున్నాడు. ఇపుడు ఆమెనుచూసి గతుక్కు మని) ఎవరమ్మా నువ్వు ? మనిషివే కదా ?

సుజాత—(చిర్నవ్వుతో) అవునుస్వామీ !

విరాగి—(మళ్ళా తనలోతాను తన్మయుడై) వాళ్ళతో అప్సరసలుమాత్రం ఎందుకురారు ? (ఆమెనుచూసి అప్సరస ఏమో అని సందేహిస్తూ) మనిషివేనా ? మనిషివేకదా ? ఐతే చీకటి ముసురుతున్న యింత రాత్రివేళ యిక్కడికి వొంటరిగా ఎందుకు వచ్చావు ?

సుజాత—(నవ్వుతో) స్వామీ! ఇది పండువెన్నెలకదా! చందమామ మబ్బు కిటికీలోనుంచి బయటికి చూస్తూ హాయిగా నవ్వుకుంటూవుంది.

విరాగి—చందమామ నవ్వుతూందికదూ ? అవును తప్పదు ! ఈరాత్రి వాళ్ళు దిగితీరుతారు.

సుజాత—ఎవరో దిగుతారంటున్నారు తమరు ? ఎవరు స్వామీ వాళ్ళు ?

విరాగి—ఎవరా ? ఇంకెవరు ? దేవతలు... దేవతలు... (ఆనందముతో తన్మయుడై) ఈరాత్రి తప్పదు. ఈపాటికి సంద

సంలో యువతులతో నృత్యం చేస్తూవుంటారు... ఈ పాటికి అమృతం తాగుతూవుంటారు... ఈపాటికి మందాకిని తీరానికి వస్తారు. మందాకిని తీరం ఎంత చక్కగా వుంటుంది !... వాళ్ళకు నావలంటూ వేరే లేవు, హంసలు తప్ప... అవి పెద్ద పెద్ద రాజ హంసలు, రెక్కలు బాగావిప్పి రెపరెప మనిపిస్తాయి. వాళ్ళంతా తలొక హంసమీదా కూర్చుంటారు. వందలకొద్ది హంసలు వరుసలు తీర్చి బారులుబారులుగా బయలుదేరుతాయి. మందాకినిలో అవన్నీ నావల్లాగ మెల్లగా తాపిగా కదులుతాయి. చిన్ని చిన్ని అలలు వాటిరెక్కలు తగిలినపుడు చినుకులై మీదికి లేస్తాయి అపుడపుడు హంసలు నదిలో బంగారు తామరతూళ్ళను ముక్కులతో కొరుక్కొని తింటూవుంటాయి. భూమీ ఆకాశం కలుసుకొనేచోట మందాకినికొక పెద్ద రేవుస్థలం వుంది. (హోరయిజన్ చూపిస్తూ) అదుగో అక్కడ దిగుతారు వాళ్ళు పాటలు పాడుకుంటూ నాట్యంచేస్తూ యిక్కడికి వస్తారు. (తన్మయత్వములో కనులుమూసుకొన్నాడు)

సుజాత—స్వామీ !

విరాగి—(ఆమెవేపుచూసి) నువ్వుమనిషివి వాళ్ళను చూసినపుడు మూర్ఛపోవకుండావుండలేవుగనక వెళ్ళిపోరాదా?

సుజాత—వాళ్లు యీరాత్రివస్తారని తమకెలాగ తెలిసింది ?

విరాగి—ఈ లోకాన్ని మరచి ధ్యానంలో వుండగా నాకు చిరునగవుతో నారదుడు కన్పించాడు, మహతిమీద ఏవో మందమయిన నిద్రను కలిగించే గీతికలు పాడుకుంటూ కన్పించీ, "వత్సా ! ఈరాత్రి నీకు దేవదర్శన మవుతుంది" అని చెప్పి అంతర్హితుడై నాడు గనక తప్పదు యీరాత్రి వాళ్ళొ దిగుతారు.

సుజాత—(సోపానముపై కూర్చుని) కిశోరీ !

విరాగి—(తుళ్ళిపడి, విభ్రమములో) ఎవరది! ఎవరది?

సుజాత—(నెమ్మదిగా అతన్ని చూస్తూ) కిశోరీ !

విరాగి—ఎవరమ్మా నువ్వు? నన్నలాగ పిలవకు ! నాకు బాధగావుంది. కిశోరి అయిదు సంవత్సరాలకిందటనే చచ్చిపోయినాడు.

సుజాత—ఎంతమాట అన్నావు కిశోరీ !

విరాగి—(బాధపడుతూ) అబ్బా ! అబ్బా ! మళ్లా అలాగున పిలుస్తావెందుకు ? ఈ లోకాన్ని నేను విడిచిపెట్టినా నన్నీలోకం విడిచిపెట్టకుండావుందే !

సుజాత—(దీనముగా) సుజాతను మరచిపోయినావా ?

విరాగి—(మెరుపు దెబ్బ తగిలినటులు నిశ్చేష్టుడై సుజాత మొహామును నిశ్శబ్దముగా, అనిమిషముగాచూస్తూ అతి మెల్లిగా) సుజాతా !

సుజాత—(కనుకొలకులలో రెండు బాష్పకణములు నిలచినవి) మళ్ళా......ఎన్నాళ్ళకు విన్నాను......కిశోరీ నీ పిలుపు !

విరాగి—(తన హృదయముమీదను తన రెండుచేతులను ఉంచుకొని ఆమెమొహామునుండి చూపు మరల్పక యింకా మెల్లగా) సుజాతా !

సుజాత—ఇన్నాళ్ళూ సుజాత నెందుకు మరచిపోయినావు ? ఎలాగ మరిచిపోగలిగినావు ?

విరాగి—(చప్పున అరచేతులలో మొహామును దాచుకొని మెల్లగా రోదనము)

సుజాత—(కనులనుండిజారుతున్న బాష్పములను తుడుచుకొంటూ) నాకీఅయిదేళ్ళూ అయిదు యుగాలైనాయి. ఆఖరికి కీనాటికి కన్పించావు ! (అతనికుడిచేతి వేళ్ళనునిమురుతున్నది).

విరాగి—(చటుకునలేచి నిలుచుని వెర్రిగానవ్వుతూ) నేను కిశోరినికాదు. కిశోరీ అనే ఆయనను నేనెరుగుదును. ఆయన ఐదు సంవత్సరాలకిందట చనిపోయినాడు పాపం ! నన్నాయననుగా ఎందుకు పొరబడుతారు ?

సుజాత—(సజ్జాలోనుండి పూలమాలికలు తీస్తూ) కిశోరీ ! అంత పరుషంగా మాటాడుతా వెందుకు ?

విరాగి—(ఆమెమాటలు విన్పించుకోకండా అటుతిరిగి ఆకాశమువేపు చూస్తూ) అవుగో అవుగో నక్షత్రాలు గజగజ కదలుతున్నాయి...ఇకవాళ్ళు దిగుతారు.........

సుజాత—నక్షత్రాలు కదలలేదు కిశోరీ నీకళ్ళల్లో నీరు కదులుతూవుందిగాని,

విరాగి—(హారయిజన్ వేపు చూస్తూ) రేపు స్థలంలో ఏవో చుక్కల్లాగ కనబడుతున్నాయి...హంసలే... ...హంసలే కావోలు) తొందరగా నడుస్తూ చెట్ల మాటునకువెళ్ళి పోయి నాడు)

(కొన్ని నిమిషములు అతను వెళ్ళిపోయినవేపుచూస్తూ కూర్చున్నది, సుజాత, తరువాతను లేచి ఆలయములో ప్రవేశించినది.)

అంతరాలయములో వెండి సెమ్మాలలో దీపాలు వెలుగుతూఉన్నవి.

నడుమ 'మన్మధ దేవు' ని 'మార్బిలు' విగ్రహ మున్నది. మన్మధుడు నిలుచునిఉన్నాడు. ఒకచేతులో చెరుకువిల్లు... తుమ్మెదల వరుస వింటినారిగా ఉన్నది. మూపున అమ్ముల పొదిలో అయిదు పూలబాణము లున్నవి—ఆ విగ్రహమత్యంతమనోహరముగా శిల్పింపబడినది. విగ్రహ పాదదేశమున పూవులు రాసులుగా పడి ఉన్నవి.

సుజాత విగ్రహము ముందు మోకరిల్లినది. ఆవిధముగా ఐదు నిమిషములుండి తల ఎత్తినది. ఉదయకాలమునమంచులో తడిసిన గులాబివలె ఆమె ముహమంతా కన్నీటితో తడిసిపోయినది. ఆమెపెదవులలో ఏమో దేవుని ప్రార్థిస్తున్నది.

ఆలయమంతా దివ్యమయిన వెలుగుతో నిండిపోయినది
ణమని బంగరుగంటలధ్వని వినబడుతున్నది. మన్మధ విగ్రి
ం కొంచెముగా కంపిస్తున్నది.

విగ్రహము కనులు కదులుతున్నవి. పెదవులు విడి నవ్వ
వి. విగ్రహ శరీరములో జీవము ప్రవహింప మొదలిడినది.
ధుని బుగ్గలు ఎరుపు బారినవి, కనులలో నీలిమ తొణుకా
న్నది. గాలికి జుట్టు కదులుతున్నది. విగ్రహము—అసలు
ధుడుగా మారినది.

మరల సుజాత మోకరిల్లి "ప్రభూ ! ప్రభూ !" అంటూ
(బంగరు గంటలు యింకా వినబడుతున్నవి.)

మన్మధుడు—(చిరునవ్వుతో) సుజాతా !

సుజాత—(భక్తితో) ప్రభూ ! ఈ నాటికి నామీద
ఁ కల్గిందా ?

మన్మధుడు—అయిదేళ్ళనుంచి నన్ను అర్చన చేస్తున్నా
నిన్ను చూసిన ఆ మొదటిరోజునే, కనబడి నీతో మాటాడా
పించింది. కాని యిన్నాళ్ళవరకూ ప్రభువుల ఆజ్ఞ కాలేదు.
ంచు సుజాతా !

సుజాత—అలాగనకండిప్రభూ! సుజాత మీపాదదాసి.

మన్మధుడు—ఎంతమెత్తని మనస్సునీది. ఎంత సున్నిత
యిన హృదయం ! అన్నీ ఆనాడే గ్రహించాను గాని అధి
కుల ఆజ్ఞ కానిదే మానవులకు కనపడడానికి వీలు లేదుకదా !

సుజాత—ఈ దీనురాలిమీద అంత దయవద్దు ప్రభూ! ప్రతికృతిగా తమపాదాలమీద యీపువ్వులకన్నా వుంచడానికింకేమీలేవు. (పువ్వులుకొన్ని అతనిపాదాలమీదను ఉంచినది).

మన్మధుడు—ఆ రాత్రిలు తలుచుకొంటే దుఃఖం వస్తుంది. ప్రతిరాత్రి వచ్చేదానవు పూవులుతో నాపాదాలు పూజించేదానవు. హారతియిస్తూ మెల్లగా ప్రార్థనలుచేసేదానవు. నీలాలవలె నిగనిగమెరిసే నీసోగకనులు చూసినపుడూ, ప్రార్థనలలో కదిలే గులాబిమొగ్గలవంటి నీపెదవులు చూసినపుడూ నా హృదయం గాలిలో పూలగుత్తిలాగ కంపించిపోయేది. వంగి మోకరిల్లినపుడు, నున్నని పాల తేటవంటి నీవీపు మీదవూగే మెత్తని పట్టుజుట్టూ, ద్రాక్షపండువంటి నిగనిగల మెడా, రేఖలు తేరిన నడుమూ నీహృదయ మార్దవాన్నిస్ఫురించేవి.

సుజాత—(కన్నీరుతో) ఇన్ని అర్చనలూ ఎందుకుచేశానో తమకు తెలియదా ప్రభూ!

మన్మధుడు:—ఎంత మధురమయిన గొంతు, నీది! చందమామలోనుంచి జారిపోయేవెన్నెలా, కలువపువ్వులోనుంచి ఎగిరివచ్చే వున్మదవాసనా, సాయంత్రం వెండిమబ్బు విడిచే వానతీగలూ సరిరావుకదా నీగాత్రానికి! నీపెదవులు విడుతున్నపుడు ఉషస్సున వెలుగులు విరిసిన తూరుపులాగ వుంటుంది.

ఇంత సుందరంగా నువ్వు ప్రార్థనలు చేస్తూవుంటే వున్మత్తుడనై మైమరచిపోయేవాడను మళ్ళా నాకు తెలివివచ్చేసరికి నువ్విక్కడ వుండేదానవుకావు.

సుజాత—(ఆనందముతో రోదిస్తూ) అంత దయవద్దు ప్రభూ! అంత దయవద్దు! దేవతలు పూర్తిగా కరుణిస్తే ఆకరుణకు మానవులు నిలువలేరు ప్రభూ!

మన్మధుడు—సుజాతా! నీవు నాహృదయాన్నెన్నడూ స్పృశించలేదు. రాత్రిళ్ళు మైకములో వుండిన నాగుండె ఎంత బాధపడేదో నీకెలాగ తెలుస్తుంది?...ఇన్నాళ్ళకు (కన్నీరు) నారదుని దయవల్ల అధికారుల దగ్గరనుంచి ఆజ్ఞ వచ్చింది.

సుజాత—(ఆశ్చర్యముతో) నారదుని దయవల్లనా?

మన్మధుడు—నారదుడు నన్ను చూసి జాలివహించి...

సుజాత—కాదు ప్రభూ కాదు! "నిన్ను చూసి జాలివహించి" అనండి...

మన్మధుడు—(ఆమెతలను నిమురుతూ) నాఅధికారితో మాట్లాడి అనుజ్ఞ తీసుకువచ్చాడు గనక నీకు కన్పించాను. మరి కొంచెంసేపట్లో మళ్ళా నేను వెళ్ళిపోవాలి!...ఏదయినావరం కోరుకో, ఇస్తాను.

సుజాత—ఐదేళ్ళయింది...నేటికి కన్పించి (గొంతు గద్గదికను పొందినది, కనులలో నీరు నిండినది)

మన్మధుడు—ఈ శుభసమయంలో కన్నుల్లో నీరుంచ కూడదు.

సుజాత—ప్రభూ... నాహృదయం తమకు తెలుసును.

మన్మధుడు—(ఆలోచించి సుజాతను తన దగ్గరకు తీసు కొన్నాడు. కన్నీరుతో తడిసిన ఆమె కపోలములను తుడిచి ఆమె క్రిందిపెదవిని వేళ్ళతో మొగ్గవలెతాకి) సుజాతా! విన్నావా ?

సుజాత—అవును ! బంగరుగంటలు.

మన్మధుడు—కాదు, అదినాహృదయధ్వని. నిన్నుచూ సిన ఆతొలిరాత్రి నాహృదయమనే లోయలోనికి వలపుకాలవ ప్రవహించింది.

సుజాత—(అతనికి కొంచెము దూరముగా నిలచి) ప్రభూ ! తమకు నేను బిడ్డను !...

మన్మధుడు—(ఆశ్చర్యముతో) ఏమన్నావూ ?

సుజాత—కిశోరి దేశాంతరగతుడయిన నాటినుంచి నేటి వరకూ అతనికోసమని తమను ప్రార్థించాను. ఇవాళ అతను కన్పించాడు కాని...(కన్నీరు)

మన్మధుడు—సుజాతా ! సుజాతా !

సుజాత—క్షమించండి ప్రభూ !

మన్మథుడు—అలాగనకు! ఈ అయిదేళ్ళూ నీకోసమని ఎంత తపించానో తెలుసునా?

సుజాత—అయ్యో! (దోసిలిలో మొహమును దాచుకొని వెక్కి వెక్కి రోదిస్తున్నది)

మన్మథుడు—(ఆమెముందు మోకరిల్లి ఆమె పాదములను తన రెండు చేతులతోను ముట్టుకొని) ఇవి తామర మొగ్గలా?

సుజాత—(కనులనుండి బాష్పబిందువులు రాలుతున్నవి)

మన్మథుడు—బాష్పబిందువులు రాల్చకు సుజాతా! అవి ఆకాశంనుంచి తెగి నేలకు జారుతున్న నక్షత్రాల్లాగ కనబడి నన్ను జాలిపొగల్లో వూపిరిపీల్చలేని స్థితిలో పడేస్తాయి

సుజాత—వద్దు ప్రభూ వద్దు నా పాదాలు తాకకండి!

మన్మథుడు—నీపాదాలు విడిచిపెట్టను! నన్ను కరుణించి స్వీకరించేదాకా యిలాగేవుంటాను! సగం మూసుకున్న ఆకనులు కొంచెం తెరవరాదా? ఆపెదవి పువ్వును నవ్వులో విడనీయరాదా?

సుజాత—(మెల్లగా) పదిహన్నెండేళ్ల పిల్లనుగా వున్నపుడే నాహృదయమనే పక్షిని కిశోరి తీసుకొన్నాడు. మానవ హృదయం కోసం ఎందుకు ప్రభూ తమకంత కాంక్ష?

మన్మథుడు—మన్మథుణ్ణి నువ్వర్థం చేసుకోలేదు. స్వర్గంలో నాకోసమని యత్నాలు చేస్తూవుండని అప్సరస ఒక తెలియ

నావుందా ? ఇందాకను నందనవనంనుంచి యిక్కడకు నీకోస
మని రావడానికి బయలుదేరినపు డేమయిందనుకున్నావు ? నం
దనవనం నడుమవున్న ఇంద్రునిమేడ మూడో అంతస్తు కిటికీదగ్గర
నిలుచునివుంది ఊర్వశి. వెన్నెల ఆమె నున్నని వొంటిమీదను
పడి మెరుస్తూంది 'మన్మథా మన్మథా' అంటూ చిరునగవుతో
వెళ్ళిపోతున్న నన్నుపిల్చింది నేనాపిలుపు వినిపించుకోకండా
మందాకినీ నదివేపు నడుస్తున్నాను. త్వొందరగా మేడదిగి వచ్చిం
ది కల్పంనీడలో యిద్దరమూ నించున్నాము. 'ఈమధ్యను నీద
ర్శనమే కాకుండావుంటే !' అంది. నేను మౌనంగా వూరుకు
న్నాను, 'ప్రభువువారు వూళ్ళోలేరు. రాత్రి మంచి వెన్నెలగా
వుంది రావోయ్ ఏమాలోచిస్తావు ?' అంటూ నాబుజాని పట్టు
కొని వూపింది. కాని నామనస్సు ఆమెమీద లేదు. గనక ఆమె
చిన్నబోయినా ఖాతరుచెయ్యకండా సుజాతకోసమని వచ్చాను.
పై విషయం నీతో ఎందుకు చెప్పానో నాకే సరిగా తెలీదు.
చెప్పాలెనంటే అలాంటివి ప్రతిరోజూ వేలకు వేలు యీమన్మ
థుడి జీవితంలో వున్నాయిగాని సుజాతా నిన్ను తలుచుకున్న
పుడు నాకు అప్సరసలెందుకు ? పూర్ణిమరాత్రి చందమామను
గానక నక్షత్రాలను చూసేదెవరు ?... ఇహ కిశోరి నీహృద
యాన్ని తీసుకున్నాడంటావు కిశోరి విరాగి అయిపోయినాడనీ
అయిదేళ్ళకు మళ్లాయిందాకను కన్పించాడనీ నిన్ను స్వీకరింప

లేదని నువ్వే చెప్పావు వైరాగ్యమనే బురదలో దిగబడినవాణ్ణి తీసేందుకు మన్మధుడుకూడా సమర్థుడు కాడేమో! నువ్వు చక్కని జలదానివి. ఎడారియిసుకలో వర్షిస్తావా? పంట భూమిలోనా?

సుజాత—(వినబడీ వినబడనట్లు) క్షమించండి ప్రభూ!

విరాగిగొంతు—(అవతలనుంచి) తారకలు కదులుతున్నాయి... అవుగో బంగరుగంటలు... వాళ్లు దిగుతున్నారు... ...దిగుతున్నారు!

మన్మధుడు—(చప్పున నిలుచుని) క్షమించాలెనా?

సుజాత—(తలవంచుకొని జాలిగా) కోపగించవద్దు! కరుణించండి!

మన్మధుడు—వినవా? వినవా? మన్మధుణ్ణే...(కోపముగా) మన్మధుణ్ణే తిరస్కరిస్తావా? (వింటికి నారిని తగిలించి కోపాన్ని తగ్గించుకొని) సుజాతా!—

సుజాత—నేను మీ బిడ్డను!

మన్మధుడు— (దుర్భరకోపముతో అమ్ములపొదిలో నుంచి ఒక బాణాన్ని తీస్తూ) సరే...సరే.........

(భయపడి సుజాత ఆలయంలోనుంచి బయటికి పరుగు పరుగున వెళ్ళిపోతున్నది. మన్మధుడు ధనుస్సులో బాణము సంధించి ఆమెను వెంబడిస్తున్నాడు.

తొందరగా ఆమె సోపానములు దిగుతున్నది. మన్మధుడు కోపంగా బాణములు వదులుతున్నాడు ఒకటి... ...ఇంకో బాణము... ...ఇంకొకటి. మూడు పూలబాణములూ గాటముగా ఆమె వీపులోనూ వక్షము ప్రక్కనూ గ్రుచ్చుకొన్నవి. బాధపడుతూ ఆమె ఉద్యానములో పరుగిడుతున్నది.

ఉగ్రుడై మన్మధుడు ఆమె వెనుకను పరుగెత్తుతున్నాడు. అతనిత్రోవకు అడ్డముగా ఆకాశము వేపు చూస్తూ విరాగి వస్తున్నాడు)

మన్మధుడు—(నిలచి) ఎవరునువ్వు ?

విరాగి—(ఆ మాటలు విన్పించుకోకుండా ఆకాశము వేపు చూస్తూ) వాళ్ళు దిగుతారు... దిగి తీరుతారు !

మన్మధుడు—నన్నింత అగౌరవిస్తావా ? మానవులకు కూడా అనువయిపోయినానా ? (విరాగి చేతినిపట్టుకొని) ఎవరు నువ్వు ? నా త్రోవకు అడ్డంగా ఎందుకువచ్చావు ? విరాగివా ?

విరాగి—(మన్మధుణ్ణి విచిత్రంగాచూస్తూ)

అ... ...వు... ...ను !

మన్మధుడు—నీపేరు కిశోరికదూ ?

విరాగి—అ...వు...ను !

మన్మధుడు— (అతికోపముతో) కిశోరివా...కిశోరివా ... ...నీకా సుజాత... ...సుజాతను నాదగ్గిర్నుంచి లాక్కోగలవా ?

(మన్మధుడు మళ్లా ధనుస్సులో బాణమునుసంధించి విరాగికి గురి చూచినాడు. భయపడిన విరాగి ఉద్యానములో పరువెత్తుతున్నాడు. మన్మధుడు అతన్ని వెంబడిస్తూ పరువిడుతు బాణాలువదలినాడు. ఒకటి......రెండు. రెండు పూలబాణములూ విరాగి గుండెలో ఒకటి, వీపులో ఒకటి గ్రుచ్చుకొన్నవి)

మన్మధుడు—(కోపోద్రేకముతో వారిని వెంబడిస్తూ చప్పున నిలచిపోయి పైకి ఆకాశములోనికిచూస్తూ) ఎవరది? ఎవరది? ఈసమయంలో ఎవరయ్యా నన్ను పిలుస్తున్నారు! పోండి!...లేకుంటే నాబాణాలు మీగుండెలు చీలుస్తాయి! .........ఓహో నారదుని వీణా! మహతీ!............ ఎందుకు? వేళఅయిపోయిందా? భూలోకంనుంచి స్వర్గానికి వచ్చివేయవలెనా? వెంటనే రావలెనా?............అయితే యిదుగో......వస్తున్నాను—

[ఈ విధముగా పైమాట లంటూవుండగనే మన్మధుడు క్రమక్రమముగా ఒక్కక్షణములో మార్బిలు విగ్రహాముగా మారిపోయినాడు.

ఉద్యానమున ద్రాక్షలతసమీపములో ఆవిగ్రహాముండిపోయినది.

భయముతో పరువెత్తుతున్న సుజాత అలసిపోయి మొహాములువంటి పచ్చికలో బోర్లాపడిపోయినది. తన తనువున గుచ్చుకొనివున్న పువ్వుటమ్ములు తనను బాధపెడుతున్నవి.

విరాగి మన్మధుడింకా తన్ను వెంబడిస్తున్నాడనే భయముతో తొందరగా పరుగెత్తుకుంటూ అక్కడకేవచ్చి అలసిపోవడముచేతను కాళ్లు తేలిపోగా పచ్చికలో పడిపోయినాడు.

రెండునిమిషాలు దొర్లిపోయినవి. పచ్చికలో అలయిక వలన కలిగిన మమతలో ఉన్న సుజాత, కిశోరి ఒకేసారి తెలివి గని ఒకరివే పొకరు చూచుకొని చిరునవ్వులు నవ్వుకొన్నారు.

ఆకాశమునంతా ఒక విధమయిన పొగ అలమివేసినది. నక్షత్రాలు గాలికి పువ్వులవలె గజగజ కదలిపోయి గణగణ మని బంగరు గంటలవలె నాదముచేస్తున్నవి)

విరాగి—దిగివచ్చారు! ఎందరో కాదు. ఒక్కరే! ఆ ఒక్కరూ స్త్రీ అప్సరస! పేరు సుజాత !!

1936 రచన.

